శ్రీ

# సంగీతవిష్ణులీలలు

అను

## దశావతారములు.



ముద్దూరి శ్రీరామమూర్తిగారిచే

రచింపబడెను.



పబ్లిషర్:

కొండపల్లి వీరవెంకయ్య

బుక్ సెల్లరు, రాజమండ్రి.



మూడవకూర్పు 2000 ప్రతులు.

రాజమహేంద్రవరమున

శ్రీ ఈశ్వర ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడెను.

1929

 [వెల 1—0—0

# పీఠిక

భాషాభిమానులారా !

ఈవిష్ణులీల యనుదృశ్యప్రబంధమును మఱల నేను రచించుటకు నాకీమహానుభావుని లీలలయందున్న భక్తియేగాని వేఱెట్టికారణమును లేదు. భారత, భాగవత, రామాయణకథ లెంద ఱెన్నివిధములుగా నెన్నిమారులు వ్రాసినను దనివితీరదు గదా ?

భక్తిపారవశ్యమున నీకథ గైకొని భాగవతములోని పద్యములే సాధ్యమైనంతవఱకు దీసికొని దొరకనిచోట్ల నాపద్యము లుంచితిని.

నాకు నాటకములు వ్రాయుట కిదియే ప్రథమప్రయత్నము. ఇందు లెక్కకు మిక్కుటంబగు స్ఖాలిత్యములుండవచ్చును. ప్రాజ్ఞు జూపించినచో తృతీయముద్రణమున సవరించుకొందును

12.2-27, కాకినాడ.

ఇట్లువిన్నవించు భాషాభిమాని,
మద్దూరి శ్రీరామమూర్తి.

వరాః ఈనాటకమందలి యంకెలు అనుబంధములను చూపుచున్నవి. అంకెలున్న స్థలములందు నాయనుబంధము చూడవలయును.

మద్దూరి శ్రీరామమూర్తి.



# ఈ నాటకమందలి పాత్రములు.



మత్స్యావతారము.

సత్యవ్రతుఁడు

హయగ్రీవుఁడు

బ్రహ్మ

సరస్వతి

విష్ణువు

మత్స్యావతారవిష్ణువు

కూర్మావతారము.

ఇంద్రుఁడు

బృహస్పతి

వరుణుఁడు

కుబేరుఁడు

బ్రహ్మ

విష్ణువు

బలి

శంబరుడు

కూర్మావతారవిష్ణువు

శంకరుఁడు.

పార్వతి

జ్యేష్టాదేవి

జగన్మోహిని

వరహావతారము.

హిరణ్యాక్షుడు

నారదుడు

వరుణుఁడు

వరహావతారవిష్ణువు

బ్రహ్మ

ఇంద్రుఁడు

నరసింహావతారము.

హిరణ్యకశ్యపుఁడ

లీలావతి

ప్రహ్లాదుఁడు

చండామార్కులు

కొందఱుబాలురు. పాములవాడు

సేవకులువత్తురు

నృసింహావతారము

వామనావతారము.

బలిచక్రవర్తి

శుక్రాచార్యులు

వామనుఁడు

రాణి

విశ్వరూపము. విష్ణువు

పరశురామావతారము

కార్తవీర్యుఁడు

వీరసేనుడు

జమదగ్ని

పరశురాముడు

రేణుక

### రామావతారము.

రాముడు
లక్ష్మణుడు
సీత
శూర్పణఖ
రావణుడు
అంగదుడు
విభీషణుడు
మండోదరి

### కృష్ణావతారము.

చంపక
నీలవేణి
రాధ
యశోద
గోపాలుడు
బలరాముడు
శ్రీకృష్ణుడు
నలకూబరుడు
మణిగ్రీవుడు
నందాదులు
బ్రహ్మ
కాళీయుడు
నాగాంగనలు
అక్రూరుడు
కంసుడు

### బుద్ధావతారము.

ఇంద్రుడు
నారదుడు
బ్రహ్మ
శివుడు
మునులు
బుద్ధుడు
తారకాక్షుడు
కమలాక్షుడు
విద్యున్మాలి
విష్ణువు
లక్ష్మి





శ్రీ

# సంగీతవిష్ణులీలలు.

# మత్స్యావతారము



## ప్రథమరంగము



కృతమాలికానదీతీరము

[ప్రవేశము,--సత్యవ్రతుడు]

సత్య—(బద్ధాంజలియై)

దండకము.- శ్రీమన్మహాదేవ! శేషాదిదేవా! కృపాపూర్ణభావా! భవద్ధ్యాన వర్గోపతాపాంబుజాలంబుగా నోపుదివ్యాత్మకా! మోక్షసంధాతవైయున్న లోకేశ, లోకోద్భవా, లోకపుంజంబు గల్పింపఁ బాలింపఁ దూలింపఁగాఁ బెక్కురూపంబులం బొందునీపాదపంకేరుహధ్యానపారీణుఁడై ఘోరసంసారవారాశిలోఁ బెక్కుకష్టంబులం బొందుచున్నాఁడ నీదివ్యరూపంబు జూపించిగాపాడవే భక్తచింతామణీ లోకరక్షామణీ దేవదేవా నమస్తే నమస్తేనమః.

నారాయణా! ఆశ్రితత్రాణపరాయణా! సచ్చిదానందరూపా సత్సంకల్పా ! సంసారసాగరమధ్యంబునఁ జిక్కియల్లాడుచున్న నన్ను రక్షింపుమా! పన్నగాధీశతల్పా.

అల్లదే ప్రభాకరోదయమైనది. నాయొనర్చినతపంబా నారాయణునకర్పించి గృహోన్ముఖుఁడ నయ్యెదఁగాక.

(జలముల గ్రహింపగా మీనుపిల్ల కాన్పించును. జలములవిడచి) రమానాధచరణారవిందముల నాడెందంబుననిడుకొనివిధివిధానంబున నప్పరమేశ్వరున కర్ఘ్యమొసంగ జలములగ్రహించుచుండ నీశకులశాబకము నాయంజలిఁబడియె, నిదియది యశుభసూచకమే మోగదా.

మీన—గీ. ఓనృపాగ్రణి యిచ్చోట • నున్న యెడల
సమతమీనాళినను బట్టి • సంహరించు
నంచుదలపోసి శరణార్థి • నైచునీదు
యంజలిఁబడితిఁ గాపాడు • మనఘచరిత.

ఓ పవిళాధీశ్వర, శరణాగతత్రాణ బిరుదాంకుఁడవని తలంచి శరణార్థినై నీయంజలిఁబడిన నన్ను దయావిహీనుండవై జలంబుల విడచితివి. ఇది నీబోంట్లకుత్తమముగాదు.

సత్య—(ఆశ్చర్యమున) ఆశ్చర్యమాశ్చర్యము! జలచరంబెక్కడ మనుజవచనంబులు బల్కుటెక్కడ! పలికినపుగా నియ్యదొక గొప్పచిత్రమైయుండనోపును-ఏమైయున శీనకుల శాలకమును గాపాడుటయె కర్తవ్యము. ఇకను దీనికులమునుగాపాడు టెట్లు. (ఆలోచింపుచుండును)

మీన—రాజన్యచూడామణీ! ఆలోచించుచుంట వేల? నన్ను రక్షింపుము. వేయిపల్కుల నిక శాశివిగాయక. నామాటకెదురాడక. నన్ను రక్షింప బద్ధకంకణుడవుగమ్ము; మున్ముందు నాయుదంతంబునంతయు నెఱిఁగిన పిమ్మటధికతరామోదమందగలవు.

సత్య—(జలములతో మీనమును గ్రహించి) ఈమీనుపిల్లనుగొన్ని దినంబులవఱకు నాకమండలోదకమునందుంచికాపాడెదగాక. ఆహా! మృత్యువన్న ప్రతిజీవరాసికిని భయమేగదా!(పరికించి మీనమునుజూచి)మఱియొకవింత - వింతపై వింత నాయంజలిపడుటకుమున్ను కడుంగడు చిన్నదైన నీమీనమింతలోననే

నాదోయిలిపట్టనంతటి దెట్లయ్యెను. ఇంతగా వృద్ధిఁబొందుట కేమిహేతువోగదా! యిట్టిది. మున్నెన్నఁడును కనివినియెఱుఁగము. కానిమ్ము యీశకుల శాబకమును నాకమండలమందుంచి గృహంబునకుఁగొంపోయి యొకపెద్దపాత్రముననుంచి కాపాడెదఁగాక (నిష్క్రమించుచు)

-❀❀-❀❀-

## ద్వితీయరంగము

-❀❀-❀❀-

సత్య — (తనలో) నదీతటంబునుండి గృహంబున కరుదెంచులోపలనె నాకమండలమంతయు నాక్రమించుకొని. యందుతనకు స్వేచ్ఛగాఁదిరుగుటకుఁ దగినంతస్థలములేదని మొరపెట్టుటచేసికూపమందుంచితిని. ఇచ్చోటనైన నామీనరాజంబునకు కిమ్ముగనుండెనో లేదో? (ప్రకాశముగ) ఓమీనరాజమా! సుఖముగానుంటివా! ఇచ్చట స్థలకుశలత్వము గలుగలేదుగదా ?

మీనము — రాజన్యచూడామణీ!

గీ. అంబుజలమున్న యీనూతి • యందునాకు
సుఖముగూర్పంగదగినంత • చోటులేదు
ఓనృపాలక యిచ్చోట • నుండజాల
గాన గొంపొమ్ము నదికి నన్ • కరుణతోడ.

సత్య — (ఆశ్చర్యమున) పట్టుమని పదిఘడియలైనగాకుండనేయొక్క చిన్నిశకులశాబకమింత పెద్దనూయియైనం బట్టజాలనంతగా వృద్ధిఁజెందుటఁ జూడ నేదో యద్భుతంబైనమాయగానున్నది.

[తెరలో]

ఓనృపాలచూడామణీ! ఈమీనరాజంబును సామాన్యమట్లు దలంపకుము. కొండొక కార్యార్థమై శ్రీమహావిష్ణు వీరూపంబున

నవతరించెననియెఱుంగుము. నేటి దివసంబాది సప్తదివసంబులకుఁ జతురాననునకొక పగలు నిండును.అప్పుడుసమస్తలోకములు ప్రళయసంద్రమున మునుంగఁగలవు. ఆప్రళయంబున భక్తాగ్రగణ్యుండవగునిన్ను గాపాడుటకే నీకిమ్మహాత్ముఁడుదర్శనమొసంగెను. నేటి శారవదినంబున సప్తమహాఋషులతోనున్న రొక్క చిన్నినావ యీకృతమాలికాతీరంబున కరుదెంచును.నీవునునాపంపున సమస్తౌషధీలతా బీజములతో నానౌక నధిష్టింపుము. ప్రళయకాలమందలి పెంజీకటివల్లబాధలేకుండ సప్తమహాఋషుల తేజంబు నిన్ను-మీనావను గాపాడుచుండును. ప్రళయవారాశిలో నౌక మునుంగకుండునట్లీ మహామీన మద్దానినితనకొమ్మునను నిల్పియుంచును ప్రళయపవనరిబువలన బాధలేకుండనొక్క పన్నగం బద్దానినిమ్రింగి మిమ్మురక్షింపగలదు. కాన రాబోవుసంగతుల గుర్తెఱింగి యీమీన ముపదేశించి నట్లొనర్పుము.

సత్య—ధన్యోస్మి ! ధన్యోస్మి !! ఏమినాభాగ్యము (1)

సీ. సంసారమనుమహా • సాగరంబునఁజిక్కి
వలుపాట్లు పడుచుండు • ప్రజలకైన
భక్తాగ్రగణ్యుల • బరికించిభక్తితో
నతులొనరించువై • ష్ణవులకైన
కర్మవిసర్జించి • మర్మంబుదెలసితి
మంచుఁదిరిగెడి స • న్యాసులైన
యనవరతంబు ని • న్నరయుంగదలఁపోసి
వనములనివసించు • మునులకైన

చేతులారఁగ భక్తితో • సేవ యు
భాగ్యములవడకుండె నా • భాగ్యమేమొ

పద్మనాభుని సేవించు ♦ పదవి దొరకె
ధన్యుఁడనునైతి కులమెల్ల ♦ ధన్యమయ్యె.

మీనరాజము నాకృతిమాలికా పదియందు విడచివచ్చెదగాక.

(నిష్క్రమించును.)

తెర పడును.



## తృతీయరంగము.



(ప్రవేశము:—హయగ్రీవుడు)

హయ—(తనలో) సవతితల్లి బిడ్డలమని మమ్మసడించి స్వర్గీయసౌఖ్యములలోఁ బాల్గొననీయక వేదశాహ్యులమని దూరముగా తరిమివైచిరి. ఆ వేదములు మాకడ లేవని యా వేదములను మేము జదువలేదని- జన్నములలోని హవిర్భాగములనీయక తామే యనుభవించుచుండిరి. మమ్మిట్టు మోసగించి మాపట్టున నింతకూరులైయున్న వీరల మోసముచేతనే వంచింపవలయును. వేదముల నాల్గింటిని సంగ్రహించుకొని పారిపోయెదగాక. (నలుదెసలు కలయజూచి) ఏమిది..యింతలోనే యింతచీకటిక్రమ్ముకొనుట కేమిహేతువో గదా. అదే ఆదెసగూడ కారుచీకటిచే నావరింపబడినదే (ముందునకుజూచి) అల్లదే యాప్రక్క నొక్క దివ్యతేజంబు మాడి. నేడో మెరయుచున్నది. (సమీపించి) ఏదో యునె కొంటిని. బ్రహ్మగారి దివ్యతేజము (యింకనుసమీపించి) అదే భారతిగూడ యాతనిప్రక్క నేశయనించియున్నది. వీరితీరుజూడ నిద్రించుచున్నట్లున్నది. మాభిసమయమే లభించినది ఇంక వేదములు లభించినవనుమాటయే, ఆహా! వేదములే లభించిన నాయదృష్టము గొనియాడదరము.

సీ. కర్మరాహిత్యుని • మర్మంబుబోధించు
వేదముల నాచేత • వెలయునపుడు
సర్వోత్తమజ్ఞాన • సంధాయకములైన
వేదముల్ నాచేత • వెలయునపుడు
అమరులగర్వంబు • హరియింపఁజాలెడి
వేదముల్ నాచేత • వెలయునపుడు
అఖిలసౌఖ్యంబుల • కాధారభూతమౌ
వేదముల్ నాచేత • వెలయునపుడు
అసురనాయకు సిగఁబట్టి • యవనికీడ్చి
సంపదలపుట్టినిల్లనఁ • జాలునట్టి
త్రిదివసామ్రాజ్యమే లెడి • పదవిగనుట
కేమియభ్యంతరంబుండు • నింక నాకు.

(పరిక్రమించి) వేదములా చతురాస్యుని నిశ్వాసవాయువులతోడ వెలికరుదెంచుచున్నవి. వీనిని సంగ్రహించి రసాతలమునందు ప్రస్తుతము వీనినిదాచి యుంచెదను. (వేదములసంగ్రహించికొని పారిపోవును.)

(వేదములు తెరలో) కమలసంభవా! రక్షింపు రక్షింపుము. మమ్మీదురాత్ముఁడు గొనిపోవుచున్నాడు.

బ్రహ్మ—(మేలుకాంచి) చిరకాలంబునుండి యించుకంతయైనవిశ్రాంతిదీసికొనక పనిచేసి నేడించుక కనుమూసిన నన్నెవ్వరోరక్షింపుమని పిలుచుచున్నారు. ఎవ్వరా పిలుచువారు.

వేదములు—కమలసంభవా! వేదముల నాల్గింటిని నిద్దురాత్ముఁడు దొంగిలించుకొని పోవుచున్నాడు.

బ్రహ్మ—దేవీ! లెమ్ము లెమ్ము వేదములనెవ్వడో తస్కరించుకొని పోవుచున్నాడు లెమ్ము. (వాణినిలేపును)

సర—నాథా! ఏమది. ఒక్కదురాత్ముడు వేదములఁ గొంచుబోయెనా! ముల్లోకంబులు ప్రళయసంద్రమున మునింగియుండ నీగ్రవ్యాదు డెట్లుజీవించి యిచ్చోటికరుదెంచియుండెను తమదివ్యదృష్టినిజూడుడు. వాఁడెవ్వఁడో మున్ముందుఁ దెలసికొనుఁడు.

బ్రహ్మ—(దివ్యదృష్టి నభినయించి) దేవీ! సోమకాసురుండను రక్కసాధముడీ యకృత్య మొనరించెను. మనము నిద్రింపకయుమున్న బ్రహ్మలోకము ప్రవేశించుటఁజేసి వాఁడు ప్రళయంబున నశింపక మనము నిద్రించుచుండఁ దరిలభించినదని వేదముల సంగ్రహించినాడు.

సర—నాథా! యిప్పుడు కర్తవ్యమేమి?

బ్రహ్మ—కర్తవ్యమునకే మున్నది_లోకరక్షకుఁడైన యాదినారాయణునిఁ బ్రార్థింపవలయును.

ఉ. వేదపురాణపూరుష వి • వేక మొకింతయులేక యెవ్వఁడో
నా దరి జేరి వేదముల • నాల్గిటిఁగైకొని పారిపోయె; నా
వేదచతుష్టంబు దొంగిలిన • వీరునిబట్టి వధించిమాదు మ
ర్యాదనునిల్పుమయ్య నిగ • మంబులబ్రోవగదయ్య మాధవా!

[తెరలో] కమలాసనా! చింతింపకుము. ముందిట్లు రాగలదని భావించియే ప్రళయసముద్రంబున మత్స్యంబనై యుంటిని. సముద్రతీరంబునకురమ్ము. ఆచ్చోట వేదముల నీకొసంగెదను.

బ్రహ్మ—మహాప్రసాదము. దేవీ! రమ్ము. దేవదేవుఁ డుపదేశించినట్లు చేయుటయే కర్తవ్యముగదా?

సర—చిత్తము. (నిష్క్రమింతురు)

(తెరపడును.)

---

## తృతీయరంగము.

[ప్రవేశము;-. హాయగ్రీవుఁడు]

హాయ - ఇప్పటికిఁగదా! నాకోర్కె నీడేర్చుకొంటిని. కష్టించి ప్రయత్నించినచో కార్యసాఫల్యము గాకుండునా! కార్యసాఫల్యము సమము చేయు ప్రయత్నమును బట్టియేగదా యుండును ఇంక నీ వేదముల సాంగముగా జదివిచూచెదగాక (అనివిప్పచుండ)

వేదములు——నారాయణా! ఈ క్రూరరాక్షసాధముని నుక్కడగించి మమ్ముగాపాడి లోకములబ్రోవుము,

హాయ—దానవారియగు నా నారాయణునిగూర్చి యీ వేదములు మొరలిడుచున్నవి ఇంచుక విప్పినంతనే యల్లరిచేయు చున్నవి గాన వీనినోళ్ళను కట్టియేయుంచి రసాతలమునకుం గొనిపోయెదను. [అనినురల గట్టిగాఁగట్టును]

(తనసీడఁజూచి భ్రమసి) అయ్యో! యికేమున్నది మాపాలిట కాలుఁడనఁదగునా విష్ణువే నాకడనుండి యీనిగమంబుల బలిమినైన గైకొనఁగోరిగాబోలును వచ్చినాడు నామేనప్రాణము లుండఁగా నీవేదముల నీతనికర్పింతునా! కలలోనివార్త. వానికం డ్లలో నెట్లో దుమ్ముగొట్టి ,పారిపోయెదగాక. [పరుగిడును ]

(పునఃప్రవేశము:—హాయగ్రీవుఁడు.)

హాయ—(నలువంకలజూచి)అయ్యయో యూరక భ్రమజెందితిని. ఎవ్వడును గానరాడు.

(తెరలో) పాపీ యింకెందుబోయెదవురా!

వేనసంరక్షణార్థమై విష్ణుండుపట్టుపీడక వచ్చుచుండెను గావలయును గాని వాయు వేగమనోవేగంబుల బరువిడగలనన్ను గలసికొనగలఁడా కల్ల కల్ల! అని ననును. రాబోవు నాపదదప్పించుకొనుట

కిప్పటినుండియే ప్రయత్నము సేయవలయును. గాన యిక్కడనుండి యే. నాకాళ్ళకు బుద్ధిసెప్పి పరుగులిడెదగాక. (నిష్క్ర)

(ప్రవేశము:——నారాయణుడు.)

నారా——ఓరీ! రాక్షసకులార్ణవబడబానలా! నిలునిలు. ఇంకెందు పోగలవు రాదుర్మతీ! వాణీమనోహరుండు నిద్రనుండు తరి వేదముల సంగ్రహించి పారిపోవుచుంటివా? నిలునిలు! నిగమంబుల నపహరించిననిన్ను మున్ముంద జక్కాడి ముందులోకులెవ్వరు నిట్లుమతిమాలివర్తింపకుండునట్లొనర్చెదను. (యించుకదూరమేగును.)

(తెరలో)

వేదము——నారాయణా! నారాయణా! మమ్ముగాపాడవా! భక్తలోకమందారా! రక్షింపుము. రక్షింపుము.

నారా——(వెనకకుదిరిగి) అల్లదే! ఆడబోయిన తీర్థమెదురైనట్లు లా దురాత్ముడీవంకకేవచ్చుచున్నాడు, రానిమ్ము. (వెనుకకొదిగి యుండును)

[ప్రవేశము:——హయగ్రీవుడు.]

హయ——అబ్బా! యెంతప్రయాసపడవలసి వచ్చినది. మిట్టపల్లంబులనక-కాలుగప్పలనక ముండ్లగిండ్లనక యేకబిగిని పెక్కు నక్కజక్కులంబరువిడి యాతనికంట దుమ్ముగొట్టియిట్లరుదెంచితిని. మాటిమాటికి వేదములు నారాయణుని బ్రార్థించుట చే నాతండెప్పుడువచ్చునో-యని భీతిజనించుచున్నది, ఆ-భీతి యేమి! ఎవ్వడడ్డంబువచ్చినను వాని జక్కాడి పిమ్మట నేరసాతలమున కేగెదగాక.

కాని యీనారాయణుని చర్యలలో గొన్ని నాకుం గిట్టవు సోదరులమే-యిర్వురతల్లులటులయుండొక్క జనకునకు జన్మించినవారమే-

యట్టిమాలో భేదంబులఁగల్పించి-మాసోదర్శుల కలహములందుఁ జొచ్చి యొకరుని రక్షించి రెండవవానిఁ జక్కాడును.

గీ. అన్నదమ్ముల కలహము • లందుఁజొచ్చి
కాకులను జంపి గ్రద్దల • సాకునటుల
యొక్కరుని జంపి రాజ్యమిం • కొకరికిచ్చి
సాఁకుచుండుట యీతని • సహజగుణము.

ఇట్టికార్యములలో నిష్కారణముగాఁ బ్రవేశము గల్గించుకొనియేవో లేనిపోనినేరములు మాపైనారోపించిదూరుచుండును.(ముందు నకు జూచితినలో) అయ్యో యెవ్వని బాఱిపడకుండఁ బాఱి పోవఁచూచితినో యాతని కట్టెదుటికేవచ్చితినే? యింకేమి దారి? భీతిమైపులిగుహాంబ్రవేశించు ఛాగశాబకము నైతినే- యీతనితోఁబోరాడుట దప్పదనితోఁచుచున్నది.

విష్ణు—వేదాపహారీ! హయగ్రీవా'నా బాఱిపడకుండ నీవెందేగఁగల వు-నా సహజగుణ మేటిఁగియునిట్టియుకార్యమున కేలమూ ఢుఁడవై సిద్ధపడితివి.

హయ—ఏలనా! యిప్పుడు నీకుపరాజయము జేకూర్చుటకే. తెలసిన దా! వేదాపహారీ! యంటివయ్యది తప్పు- బ్రహ్మసృష్టిలోని వారమైన మేముఁగూడ వేదములఁజదివి వానివలన నుపయో గము బడయుపచ్చును గాన నేనావేదంబులగైకొంటినియిం దాక్షేపణమేమున్నది ఈవేదముల జదువని వారమగుటచే తనేగదా యజ్ఞములలోని హవిర్భాగములు మాకీయక దేవ తలే యనుభవించుచుండిరి.

నా— ఓరీ! దురాత్మ! వేదబాహ్యులగుటకు మీపవ్రర్తనమేకార ణము. యజ్ఞములలోని హవిర్భాగములఁ గొనుటకు మీరెం దుల కనర్హులైతిరో యెటిఁగింతు నాలింపుము.

సీ. జపతపోహోమాది • సత్కర్మలనువీడి
యీరీతి మీరు వ • ర్తించుకతన
కారుణ్యమొక్కింత • గల్గనైనదలంపక
హింససేయఁ గనడు • గిడుటకతన
సౌఖ్యమే మరచి యు • సత్యమే మనకొండు
బూర్ణలాభంబని • మురియుకతన
పరలోకమనుమాట • భావింపఁబోవక
యిహలోకసుఖము కాం • క్షించుకతన

చేయరానట్టి పాపముల్ • సేయుకతన
నడువఁగారానిపథముల • నడచుకతన
కర్మభూమిష్ఠులైనయా • గములలోని
హవ్యములు గొనబోర • వగ్గులైరి.

దురాత్మా నీసందియముతీరినదా! యింకనిన్ను జక్కాడిలోకం బులకు నీతిసెప్పెదగాక.

హయ—ఓరీ! యెంతపెద్దయుపన్యాస మొనరించితివి చాలుచాలు నికనూరుకొనుము. రమ్ము! నిన్నుజక్కాడినతిప్పట నీవేదముల రసాతలమునకు గొంపోయెదగాక. (యుద్ధముచేయుదురు)

హయ—(తనలో) అబ్బా!యీతనితో బోరొనరించుట కడుంగడు గష్టముగా దోచుచున్నది. ఈవేదములీతని పాలబడకుండ జే యవలసియున్నదికదా.

(మరలయుద్ధముచేయుచు పరుగిడును.)

విష్ణు—ఓరీ!దురాత్మా!సముద్రముజొచ్చిన నిన్ను వెంటాడలేననియే దలంచితివా! సర్వవ్యాపకుండనైన నాబారిపడకుండ నీవెంతే గ గలవు.పొమ్ము. జలధిలోననేమరణింపుము (నిష్క్రమించును)

తెర యెత్తఁగా

మత్స్యావతారవిష్ణువు.

ప్రవేశము:—సత్యవ్రతుఁడు. బ్రహ్మాదులు.

సత్య—పన్నగాధీశతల్పా! సత్సంకల్పా! భవద్దివ్యసందర్శనంబున నేఁడు గడు కృతార్థుఁడ నైతిని. సర్వకాలసర్వావస్థలత మ్మొక్క శరణాయకుం డుగ నన్ననుగ్రహింపుము. నాప్రణామశతంబును గొనుఁడు.

మత్స్యావ—కమలాసనా! ఈ వేదచతుష్టయముం గొని లోకంబుల యథాప్రకారము సృష్టింపుము సత్యవ్రతా! నీభక్తికేనెం తయు సంతసించితిని, నాసాయుజ్య మొసంగితిని, రమ్ము.

అంగణు—మహద్భాగ్యము.

తెర వ్రాలును.





శ్రీ

# సంగీత విష్ణులీలలు

## కూర్మావతారము.

౧

(ప్రవేశము:—ఇంద్రుఁడు, బృహస్పతి, వరుణుఁడు మున్నగువారు)

ఇంద్రుఁడు—గురూత్తమా! క్రూరరాక్షసులవలన దారుణబాధల కోర్చి
యిట్లింతకాలమని మనియుండఁగలము. దీనికిఁదగిన ప్రతీకారమే
మియును లేదా ?

బృహ—శచీంద్రా! నాఁడు దూర్వాసుఁ డొసంగిన శాపవశంబున లో
కంబులు ధనహీనంబులయ్యె! యిత్యాదికారణంబుగ భూలో
కంబున యజ్ఞయాగాదికర్మలడుగంటుటను ఎక్కడనైనజన్నము
జరుగుచుండెనని తెలియవచ్చినంతనే మున్ముందుగ రాక్షసా
ధములు వానికి విఘ్నమాపాదించి మన కుపవాసంబులఁ గ
ల్పించుచున్నారు.

వరు—ఇట్టి ఘనకార్యము లొనరింప సాహసించిన యాదురాత్ములు
దిక్పాలురఁ గూడ నిర్జింపఁదలంతురేమో యను సందియముద
యించుచున్నది

ఇంద్రు—ఇత్యాదికమే నాభయకారణము. ఎప్పుడెవ్వఁడు దండెత్తివ
చ్చునో యని తత్తరిల్లుచునే యుంటిని. ఛీ ఛీ! యింద్రత్వమువ
లన నాకిసుమంతయైన సుఖము లేదు. దినదిన గండము నూరేం
డ్లాయువని నట్లున్నది నాబ్రతుకు ఇప్పటికీకష్టములు దీరఁగదా

సంతతుల బలమును గూల్చు • నంతవఱకు
వారితో మైత్రిచేయుగా • వలయునిపుడు.

శచీంద్రా!

చ. పటుతర బాహువిక్రమము • పారముగాఁగలదాన వేశ్వరుల్
కుటిలతనంబు చూపది • గుల్ వడనేలసహింపుమయ్య నీ
యటమట లెల్లదీరువఱ • కాదనుజావళిఁగూడి మీరు దు
ర్ఘటమని యెంచబోవక ద • గ్గర మధి యింపుడు పాలసంద్రమున్

దనుజాధములతోఁగూడి నానానేక యోషధిలతల సంపాదించి పాల సముద్రమునవైచి మంధరకంధరమును కవ్వముగజేసి వాసుకి యనుమహానాగము త్రాడుగాచేసి మథించిన జరామరణముల జయించు యమృత మాదుద్భవింపగలదు. ఆయమృతపానమున మీరు బలసంపన్నులై దనుజాధముల నిర్జింపగలరు- కార్యసాధనకడంగుడు (అంతర్ధానమగును.)

బృహ — నారాయణదేవుఁ డుపదేశించిన ట్లొనరించుదము- శచీంద్రా! దేవిని స్వర్గలోకమున కేగదను. (నిష్క్రమించును)

ఇంద్రు — గురువర్యా! పెక్కు కష్టంబుల కోర్చి యమృతమును సంపాదించినను రాక్షసులు మనకడనుండి యయ్యమృతమును లాగుకొనిన మన మొనర్పఁగలదేమున్నది

బృహ — దానికై చింతింపవలసిన పనిలేదు శ్రీహరి యెట్టులో మనక మృతము నొసంగి రాక్షసులకు నున్న జట్టును. సందేహింపకుము

(తెరలో కలకలము)

ఇంద్రు — (ఆలించి) ఆకలకలధ్వని యేమి? యుప్పతిల్లియుండును.

బృహ — రాక్షసాగమనము సూచించు మనవారి కేకలై యుండనోపు,

(తెరలో) త్రిభువనసామ్రాజ్యలక్ష్మీ పురంధరుండనను గర్వమునించిన కన్ను మిన్నుగానని యింద్రుఁడు చేడీ!

ఇంద్రు—గురువరా! కర్తవ్యము కర్తవ్యము.

బృహ—కర్తవ్యమున కేమున్నది. కర్తవ్యమమాని వారలతో నెయ్యంబుననుండుమనిగదా నారాయణదేవుఁ డుపదేశించెను. అజ్ఞానర్పుటయే ముఖ్యకర్తవ్యము- కాన నీవు ప్రస్తుతము వైరమునుమరచి- యాబలీంద్రున కెదురేగి దోడ్కొనివచ్చి పీఠమిడి యాదరింపుము.

(ఇంద్రుఁడు నిష్క్రమించి బలిశంబరులతో ప్రవేశించును.)

ఇంద్రు—సోదరా! దానవసార్వభౌమా! ఆయాసనమలంకరించి తన్న కృతార్థు జేయుఁడు.

బలి—ఇంద్రా! యీ నక్కవినయము లెక్కడనేర్చుకొంటివి. ఇట్లు నటించుమని నీ కెవ్వరుబోధించిరి.

శంబరు—సార్వభౌమా! అడఁచినజుట్టుము నందకున్న గాళ్ళనుబట్టుకొను స్వభావముగల యీ దేవతులు జిత్తులమారులు అట్టివీ రొకనికడ నీవిద్య నేర్చుకొనక్కరలేదు.

బలి—ఇంద్రా! యీనక్కవినయముల పోవిడచి ప్రస్తుతాంశమును వినుము స్వర్గీయసౌఖ్యములు చాలాకాల మనుభవించితివి ఇంకనించుకింత విశ్రాంతిదిసికొనుము. నీయనుంగు తమ్ములమైన మాపై నీస్వర్గరాజ్య రమామణిని విడచి మెచ్చోటికైన బొమ్ము. అట్లొనర్పకున్న నిను రణరంగంబునజక్కాడి విజయలక్ష్మితో నీ స్వర్గరాజ్యలక్ష్మినిఁగూడఁ జేకొందును.

ఇంద్రు—సోదరా! సకలకష్టంబుల కాకరంబైన యీస్వర్గరాజ్యము విడవవలయుననియే దలంచుచున్నాను గాని,

బలి—హంసపాదు లనవసరంబు- నీకానీల-విడచి-నీచేజేతుల నాకుఁ బట్టాభిషేక మొనరించి తత్క్షణమే వెడలిపొమ్ము.

నరు—అగ్రిసోగరిముల్యాండనగు సీకీతఁడా పట్టాభిషేక కౌతుకముగు ట లోకులవిన్న నన్నా!

శంబ—ఔ ఏందిగ్రీ! బలీంద్రుడిడే స్వర్గమేలుటకు సమ్మతింతువా!

బృహ—బలీంద్రా! శంబరా!! నావాక్యములాలింపుడు. పలుకష్టం బులతో గూడిన యీరాజ్యభారమును తనభుజములపైఁబడ వేయనేలయని సందేహించుచున్నాడు ఈతఁడప్పనను సేగ దానవులక్షేమమును కాంక్షించుచుండుము కాని

శంబ—కాని యనుచుంటివేను

బృహ—ఇంతపరకయ్యాది సెర వేరలేదు

శంబ—ఇంతటినుండి కలుగును. రాజ్యమును మాకునదలినచో స్నేహ భావముతోడనే యుండవచ్చును.

ఇంద్రు—అయ్యాది సరికాదు. దేవదానవులని భేదములేకుండ నన్నియును మనకెల్లరకును జరామరణరాహిత్యముచేకూర్చు దివ్యామృతమును సంపాదించుమార్గ మొక్కటిగలదు.

బలి—(తనలో) ఆదివ్యామృతమునుగూడా సంపాదింపవలసినదే (ప్రకాశముగా) పురందరా ఆమార్గ మనుసరించుటకు దానవులందఱును సిద్ధముగానుండిరి. గాని యీయమృతమును సంపాదించుటెట్లు?

బృహ—ఇప్పటికే కాలమతిక్రమించినది! భోజనాదిక్రియల నిర్వర్తించికొనినపిదప నెల్లసంగతుల మాచ్చటించుకొనవచ్చును రండు

(నిష్క్రమింతురు.) (తెరవాలును.)

క్షీరసాగరతీరము.

హూన్మానతారము ద్వితీయరంగము,

[ప్రవేశము:—ఇంద్రాదులొకవంకను, బలిశంబరాదులొకవంకను]

బలి—పురందరా! కార్యము విఘ్నమైనది. మాపడినశ్రమవ్యర్థమై

సదిబూడిదనుబోసినపన్నీరయినదియింకేమున్నది-తుచ్ఛులగు
దేవతల మాటలునమ్మి మోసపోయితిమి!

శంబర—ఇంద్రా! ఇందులకేమేని ప్రతీకారమున్నదా! లేక నోరు
మూసికొని యూరకేగుటయా

ఇంద్రు—దానవసార్వభౌమా! తత్తరపాటుజెంది యూరక మమ్ముల
నిందింపకుము. మనకిట్టిమార్గ ముపదేశించిన యా యుందిగా!
రమానుని ప్రార్థించిన ప్రసన్నుడై యేదేని కార్యసాధనో
పాయ మాలోచించితీరున.

బలి—అట్లనే కానిండు.

(అందఱు ప్రార్థింతురు.)

(అనుబంధము)

బలి—

శా. ఓరాజీవదళాక్ష మందరము పా • థోరాసిలో మున్గెనే
కారుణ్యం బిసుమంతజూపు; మెటులో • కార్యంబు సాధింపగా
మారాముల్ పడుచున్న మమ్ముగుణధా మాబ్రోవగా నేడు నీ
వే రాకున్నను దిక్కు మాకెవరు లో • కేశా కృపంజూడుమీ

[ప్రవేశము:—విష్ణువు]

విష్ణు—దేవేంద్రాదులారా! దానవేశ్వరులారా! వెరువకుడు. వెరు
వకుడు. కూర్మావతారమెత్తి యీమందరంబును పైకిదేల్చె
దను. పట్టుదలవీడక కార్యసాధనకై కడంగుడు. (నిష్క్రమి)

బ్రహ్మ—మహానుభావా! ఆదినారాయణా! మున్ను సోమకాసుర
సంహారసమయమున మత్స్యావతారరూపమును జూపి మ
మ్మానందింపజేసినట్లు కూర్మావతారరూపసందర్శన మొసంగి
మమ్ముల చరితార్థులఁజేయవే.

(ధ్వనితో తెర వేయును)

(కూర్మావతారస్వరూపము.)

బ్రహ్మ—ధన్యోస్మి! ధన్యోస్మి!! (అందఱునమస్కరింతురు.)

(కూర్మావతార మంతర్థానమగును.)

బలి—(నిర్ఘాంతపడి చూచుచు) శచీంద్రా! మంధరము సముద్రము నుండి లేచినది మరల తరుచుట కారంభింతమా!

ఇంద్రు—అట్లనే యొనర్తము.

(సముద్రమునుమథింప హాలహాలము పుట్టును.)

బలి—ఇంద్రా! యిదేమి? పెనుమంటలతో లోకమును భస్మీపటల మొనర్చుచున్నది.

(తెరలో) దేవదానవులారా! వెరువకుఁడు. ఆయుద్భవించినది హాలాహాలము. అద్దానిని శాంతింపఁజేయుముని. వెంటనే యీశ్వరునిఁ బ్రార్థించుఁడు లేకున్నచో హాలాహాలము వలన లోకములన్నియుఁ గాలి భస్మీపటములు గాఁగలవు.

బలి—ఇంద్రా! కర్తవ్యము వింటివా. అట్లొనర్తమా!

బ్రహ్మ—శంకరా! భక్తవశంకరా! హాలహాలము వలన లోకములు భస్మీపటములగుచున్నవి కాపాడుమా!

ఇంద్రు—పరమేశ్వరా!

కం. నీకంటె నొండెఱుంగము
నీకంఠంబె బరులుగాన ♦ నేరరుజగముల్
నీకంటె నోడయుఁడెవ్వఁడు
లోకంబుల కెల్ల నిఖిల ♦ లోకస్తుత్యా.

మత్తకోకిల. బాహుశక్తి సురాసురుల్ సని ♦ పాల వెల్లి మథింప హా
లాహాలంబు జనించె నేరిక ♦ లంఘ్యమై భువనంబు గో
లాహాలంబుగఁ జేసె చిచ్చును ♦ లాగముంగొని ప్రాణి
సందోహముఁ బ్రదికింపవే దయ ♦ దొంగిలింపగనీశ్వరా.

ఇం — చిరశశిభాస్కరా! పార్వతీచిత్తచోరా! నీవుగాకున్న మాకింక దిక్కెవ్వరు

[ప్రవేశము:— పార్వతీపరమేశ్వరులు]

శంక — దేవదానవులారా! భయ మొందకుడు. ఈ హాలాహలమును భక్షించి మీయాటపాటలెల్ల క్షణములోఁ దీర్చెదను (పార్వతివైపునకుఁ దిరిగి)

క. శిక్షింతు హాలహాలమును
భక్షింతును మధురసూక్ష్మ • ఫలరసముక్రియన్
రక్షింతు ప్రాణికోట్లను
వీక్షింపుము నీవు నేఁడు • విశదాబ్జముఖీ

(హాలాహలమును భక్షించి) సురాసురులారా మీకోసమై హాలాహలమును నాఁటితో నింకమీఁదకొఱకై పెట్టుకలతో యత్నింపుము

(ప్రవేశము— జ్యేష్ఠాదేవి)

జ్యేష్ఠా — క్షీరసాగరముతో గర్భమం దుద్భవించిన నేనునివసింపదగిన తావులను నాచేయుకృత్యములను తెలుపఁగజేయవే!

బ్రహ్మ — (తనలో) ఏమీ వికృతాకారము (ప్రకాశముగ) ఓముద్దుగుమ్మా! దబ్బరలాడుచు దత్తంబైన ధనంబు నపహరించి మధుపానాసక్తులై యుండువాండ్రను మధుసేవాపరాయణులై వాదదేవి నాశ్రయించి కొండెలాడుఁగగ యిల్లువాకిళ్ళ నమ్ము వాండ్రను చరణంబులైన గడుగక జపతపోహోమాదికార్యంబుల నిర్వర్తించు డాంభికులను- సంజ కెంజాయలందు నిద్రపలువువాండ్రను- అరిషడ్వర్గపీడితులై- కులాచారధర్మముల మరచి వర్తించువాండ్రను దురాచారసంపన్నులైనవాండ్రను నీకు నమ్మినబంట్లుగా నుందురు ప్రొద్దెక్కి- మేల్కాంచు ముద్దరాండ్రను- విభులతో జగడించువాండ్రను-

దురాచార సాపర్యులైన జవరాండ్రును. పతిభక్తి వంచించి చెడి జారిణులై మత్తిల్లి దిరుగుతలిరుబోండ్లును. కారణం బిమ్మ మాతయు లేకయిరుగిండ్లకుం బొరుగిండ్లకుబోవు వాండ్రును. భర్త భుజింపకమున్న భుజించు గయ్యాళులును. పిలిచి కయ్యములాడు వారును ప్రియులనగ చాట్లబెట్టుకి దుర్మార్గరాండ్రును నీకు నమ్మిన చెలికత్తెలై యుందురు హరివాసరత్రయంబులాచరింపవియిండ్లను కలహంబులే యెల్లప్పుడును గలుగు నిండ్లను కలియొండ లెక్కనపిమ్మట కసవులూడ్చెడి యిండ్లను దేవపూజలు లేని యిండ్లను. యాగ. అధ్యయనములులేని యిండ్లును నీకు నందనోద్యానతుల్యములు. వత్సా! కలియుపూపా సిసిమెము సహధర్మచారిణిగాగొని సుఖంబుండుము.

కలి—మహాప్రసాదము. (కలి జెష్టాదేవి నిష్క్రమింతురు)

(సముద్రము మథింపమడగా నుచ్చైశ్శ్రవము. ఐరావతము. పాంచజన్యము. కల్పవృక్షము. అప్సరసలు. లక్ష్మిసుధాకరుడు. క్రమక్రమముగా నుద్భవింతురు)

బలి—ఈ వస్తువము మేమసేయుదుము. ఈ లక్ష్మిసుధాకరుల నేమి చేయుదుము.

బ్రహ్మ—బలీంద్రా! ఇందొక్క రహస్యమున్న దాలింపుము. మనకొఱకై కూర్మావతార మెత్తిన యా శ్రీహరి కీలక్ష్మిదేవిని యొసంగవలయునుగదా! హాలాహలపాన మొనరించిన యా మహేశ్వరున కీసుధాకరు నొసంగుదము ఈ సుధాకరుం డాతని జటాజూటమున నిలిచి తన శీతకిరణంబులచే హాలాహలము వల్ల హాని రాకుండ గాపాడుచుండును, ఇంతియెగాక మన కీ మార్గముపదేశించినందుల కాహరి

శ్రీపాంచజన్య మొసంగితిని చో యుక్తముగానుండును మిగిలిన వస్తువుల స్వర్గమందుంచుదము.

బలి—స్వర్గమందేల మా భూలోకమునకు గొంపోయెదము.

ఇంద్రు—సోదరా! మరల మా నీ యందు యారంభించితివా మన మందఱ మొక్కటిగాఁ గోరితిమి కదా యీ యత్నము

బలి—పురందరా! మఱచితిని అట్లనే యొనరింపవచ్చును

(మహామనోహరముగా అమృతముతో ధన్వంతరి ప్రవేశించును)

బ్రహ్మ—ఇంద్రా! ఈ యమృతమును గొనుము

బలి—నేనుగూడ నైకొనుటకు సన్నద్ధుండనే

బ్రహ్మ—నీ యనుమానముండ నీ కేటికి క్లేశము

ఇంద్రుడు—అమృతమును గొనును)

బలి—(అమృతకలశమును రెండవ వైపునుండి పట్టుకొని) నీ వొక్కడవే ఎట్లు గొన్నయెడల జాతి ప్రమాదవశత క్రీడబడునేమో!

బ్రహ్మ—ఆ సముద్ర శేషమున మన మీయమృతమును భాగించుకొని యనుభవింతమురండు (తనలో) నా ప్రయత్నము కొనసాగునట్లు లేదు అయినను ప్రయత్నించెదను (నిష్క్రమింతురు)

## తృతీయ రంగము

[ఇంద్రాదులు లోకపంక్తిని దానవులు లోకపంక్తిని ప్రవేశింతురు]

ఇంద్రు—బలిసార్వభౌమా! ఆయమృతకలశ మిటు దెమ్ము. సమముగా భాగించెదను.

బలి—ఆమాత్రపు కార్యము నే నొనర్పగలను అంతియే గాక నీవడిగినట్లు నేను నీ కగ్రసోదరుండ నగుటచే భాగము నేను చేయవలయును.

శశి—సోదరా! దానవసార్వభౌమా! యిప్పట్టున

శంబ—వరుణా! యూరకొనుము.

గీ. యజ్ఞముల హావిర్భాగము • లందునపుడు
సోమరసపాన మొనరించి • సోలునపుడు
అనుజులముగాక నేడు కార్యాంతరమున
సోదరులమటంచు బల్కఁగాఁ • జోద్యమయ్యె

ఇంద్రు—అక్కటా! (తనలో) విధినతిక్రమింప విధికైనఁదరమగునా? పడరాని యిడుములబడి-బహుప్రయాసతో సంపాదించిన యీ యమృతమును-యీనగాచి నక్కలపాలు జేసినట్లు-యీ రక్కసిముండకొడుకుల పాలొనర్చితిని దేవాదిదేవా!

గీ. ఎన్నఁగారాని కష్టంబు • లెన్నియేని
బొంది సాధించి యమృతము • బొలసుదిండ్ల
పాలొనర్చితి నిప్పుడో • పరమపురుష
నీవె కాపాడవలె నమ్మ • నీరజాక్ష

నారాయణా! ఆర్తత్రాణపరాయణా! నీవే మాకిప్పట్టున శరణ్యము—

(ధ్యానించుచుండును.) (అనుబంధము)

[ప్రవేశము:—జగన్మోహిని]

(నృత్యముఁజేయుచు జగన్మోహిని రాక్షసులపై నభినయము పట్టుచునొకనికి దెలియకుండ నొకనికి సైగఁజేయుచుండును.)

బలి—(తనలో) వెవ్వ నుకమూఁగతి! హాయ్-హాయ్-ఏమి యీలతాంగి సోయగము. నాహృదయమును యొక్క యుట నిముసంబులో దొంగిలించినది. బాపురే. ఏమీ యభినయ చాతుర్యము. ధన్యోస్మి! ధన్యోస్మి!! యీసుగుణమంజరి తన కెంగేలా కసేతులో నన్నాఁకాపుఁడము సను గాఁబోలు

చున్నది. నాజన్మమింక సార్థకమైనది- యీయమృతపానము
నకు దోడీవ యధరసుధామృతపానము గూడ లభింపనున్నది
ఈ తన్వి లభించినచో నాకింక నీయమృతముతో బనిలేదు.ఏ)

శంబ—(తనలో) వహ్వారే! ఎంతలో నాహృదయము దొంగిలించిన
ది. నాహృదయమునందలి ప్రేమ ధనమంతయు గొల్లలాడి న
న్ను పరిమితానందము నందజేయుచున్నది. ఇప్పుడేమి సేయవ
లయునో గోచరింపకున్నది.

ఉ, ఉల్లము తల్లడిల్లగ సు•మజ్వలకాంతి సమూహవాహినుల్
వెల్లువకట్టి పారనటి•వేడ్కనటించు మోహినన్న యీ
పల్లవపాణి నాహృదయ•పద్మములోని యమూల్యమైన సొ
మ్మెల్ల హరించి నిల్చె విధి • యెట్లు శిక్షించెనో నోపకుండెదన్.

మదు—[తనలో]తరించి తీరిది నాజన్మ. నన్నే రమ్మనుచున్నది.
లేదు, లేదు. స్త్రీలనమ్మరాదు. ఈమెకు నిజముగా నాస్త్రై
ప్రేమగలదా! ఏమో ఎవ్వరు చెప్పగలరు. (మోహిని మరల
సైగచేయుచున్నది) ఆ-ఆ. నన్నే. అమ్మతోడు - నన్నే రమ్మ
నుచున్నది. నాయందు మీమె పెండంబునకు నచ్చినదిగా బో
లును. నన్ను మోహించినది గాబోలును.

గీ, ఇచటి పూరుషులందున • నెన్నదగిన
యందగాడని తనమది•నెంచుదలచి
యీ లతాతన్వి తనకృపా•దృష్టి బరపి
నన్నె చేపట్టుమని కను•సన్న సేసి.

తాను లభించిన నాకీయమృత మక్కరలేదు.

ఇంద్రు—(కండ్లు తెరచి తనలో) పరమేశ్వరమాయ. ఈకాంతయెవ్వ
రు- (పరికించి) ఈమెయందు హరిపోలికలు గొన్ని దోచుచు
న్నవి- (మరల పరికించి) సందియము లేదు.. ఆదినారాయణు

డె.యీరూపంబు నవతరించి రాక్షసుల వంచింపదలచినట్లు న్నది. కానిమ్ము. ఇప్పటి కినుమంత ధైర్యము చిక్కినదిగదా ముం దేమిజరుగనున్నదో.

బలి—సుందరీ ! నీ వెవ్వతెవు. నీవృత్తాంతమేమి. యెవ్వరియాన నీ విచ్చటి కరుదెంచితివి- నీ తల్లిదండ్రు లెవ్వరు ?

మోహిని—(నవ్వుచు)

గీ. ఒకరియానకు లోఁబడి • యుండగాని
యొకరి నాయానకై వేఁచి • యుందు నెపుడు
తల్లిదండ్రులు లేరు యీ • ధాత్రిమీఁద
నిటుల వర్తించుచుందు నే • నెల్లయపుడు

నన్నెల్లరు జగన్మోహిని యందురు. తమబోటి సుందరాకారులఁజూచి- నంతటినుండి మన్మథుఁడు- నాడెందమును సందడింప- నే నిం- ద- రు- దెంచి- తి-

ఇంద్రు—దానవోత్తమా! ఆయమృతమును భాగించుకొందమురమ్ము

బలి—సారముగానుండును. అమృతకలశమును ముట్టితివా? దాడ పండ్లూడగొట్టెదను.

జగ—దానవసార్వభౌమా యీతనితోఁ కలహమేల కలహకారణమేమి.

బలి—ఈ యమృతమును మే మందరమును గలిసి సంపాదించితిమి.

జగ—అయిన సమముగా భాగించుకొనుడు.

బలి—తానే మాతను. వారికిని పంచియిచ్చునట.

జగ—అంగీకరించిన- నేను-అయిననాకేల? మీరేభాగించుకొనుడు

బలి—కల్యాణీ సంశయింతు వేల? మా న్యాసమువహించి యీయమృ తమును పంచిపెట్టుము.(శంబరునితో రహస్యముగ)వారలకు తక్కువ మనకు నెక్కువ యిమ్మని సైగ చేసిన యట్లయిన

మరల సన్న జేసినదిలెమ్ము. (ప్రకాశముగా) ఇంద్రాది యిరా
లతోతన్విభాగించుచు నన్మతించెదవా?

ఇంద్రు—సమ్మతమే.

జగ—(కనుసన్నతో బలినిజేరి యమృతకలశమును గ్రహించి రహ
స్యముగా) ఈదేవతలకు ముందుగా కొంచెముగాబోసి మిగి
లిన దంతయును మనమే యనుభవింతము.

బలి—(అపవారించి) అట్లేచేయుము ఈయమృతమునకుఁ దోడుగనీ
యధరామృతమునుగూడ యొసంగి న న్నాదింపవలెను.

జగ—(అపవారించి)అందుల కేగదా! యీయత్నము (ప్రకాశముగా
దేవదానవులారా! పంక్తులుదిర్చి కూర్చుండుఁడు.

(దేవత లొకవంకను రాక్షసు లొకవంకను గూర్చుందురు)

జగ—ఇంద్రాదిదేవతలారా! ఈయమృతమును గ్రోలుడు

(అని వారలకుఁబోయుచున్నది.)

రాహువు—తనలో) ఈజగన్మోహిని దేవతలకే పోయుచున్నది.
అమృతమంతయు చెల్లినట్లున్నది.జాలముచేసిన కార్యములేదు
నేనుగూడ దేవతలవలె జేకుదును. (అని దేవతలలోఁజేరి
కూర్చుండును)

జగ—(వానికి సుధబోయును)

సూర్యచంద్రులు (రాక్షసుఁడని సైగసేతురు)

జగ—(వరికించి చక్రమునతలనరికి రిక్తకలశమునుపారవైచియంత
ర్ధానమగును]

బలి—ఏదీ! జగన్మోహిని అరే యెంతపనిజేసినది.

శంబ—అంతర్ధానమైనది నేను సందేహించినట్లే యైనది.

౩ రాక్ష—ఇట్లు జరుగగలదనియే నేను దలంచితిని.

బలి—అయిననేమిలెండు. ఓదానవులారా! లెండు. లెండు. యుద్ధ
మునకు సిద్ధపడుడు. దేవతల జక్కాడుడు. (6)



శ్రీ

# సంగీత విష్ణులీలలు.

## వరహావతారము.

ప్రవేశము-హిరణ్యాక్షుఁడు.

హిర—మర్త్యలోకంబున నాతోఁ బోరాడఁగల శూరుఁడుగన్పడఁడే కమలాసన వరప్రభావముఁ జూచుట కొక్కప్రత్యర్థియైన భూలోకంబున నేడీ ఛీ! ఛీ! అంతలోకమును నిర్మించి యా బ్రహ్మ నాతోఁ బోరాడగలమానవు నేల సృజింపకఁ బోయె నోగదా! ఈస్వర్గమునందు నెవ్వడైన యుండునేమోయను గంపె డాసతో నరుదెంచితినిగాని ఛీ! ఛీ! యింతైన నదగినవాడు లభింపడయ్యెను. ఈ స్వర్గాధినాథుఁడును-పర్వతగర్వభంజనుఁడును అగునావజ్రపాణుఁడైననింత రణభిక్షయొసఁగునని దలంచివచ్చితినిగాని యీఁతడను గాన్పింపడు. కారణమేమైయుండును.

ముల్లోకంబులకు ప్రభుఁడైన యా శచీంద్రుఁడు నాధాటికడఁలి పారిపోయి యెందైనడాగియుండునా? అట్లైన నటకేని జరిగియుండెదు

సీ. అమృతంబనియెడి ది • వ్యౌషధముంగ్రోలి
బలుఁడనేనని గర్వ • పడెడివాఁడు
భువనత్రయంబును • బాల్పొందగానేలి
బలుఁడ నేనని గర్వ • పడెడివాఁడు

అలనగంబుల తొక్క • లవలీల దన మాడి
బలుఁడ నే నని గర్వ • పడెడివాడు
హరిపాశ్రుగలదంచు • వసయుంబు దలపోసి
లుఁడ నే నని గర్వ • పడెడివాఁడు
గీ. తగినవీరుఁడు లభియింప • దనదునేర్పు
జూప రణరంగమున నిల్వ • జూచుగాని
సిగ్గువిడియుష్ల్ లేనట్టి • చెనటిపోల్కి
వెరచి డాగొన నెటకేని • పరుగులిడునె.
ఏదో కార్యాంతరమున నాకెన్నటితో మాట్లాడనగియుండను గాని
నే వచ్చుచుండు టెఱింగి భీతిన్ని దాగొనియుండడు.

(ప్రవేశము-నారదుఁడు (7) పాడుచు)

హిర—(నారదుని సమీపించి) సురమునీంద్రా! నాకృతనమస్కార
ములఁ గొనుడు.
నార—హిరణ్యాక్షా! యిందుంటి వేమి? (తనలో) భూలోకమును
భస్మీపటల మొనరించి యిచ్చోటి కరుదెంచితివా?

హిర—భూలోకంబున నాతోఁ బోరాడఁదగిల వీరుఁడు లభింపమి
యీస్వర్గాధినాధుఁడైన శచీంద్రుఁడేసి యిచక రణభిక్ష యొ
సంగగలఁడని వచ్చితిని. కాని యాతఁడేదో కార్యార్థమై వైకుం
ఠమున కరిగియుండెనట. ఇచ్చట నాతని రాకకై వేచియుంటిని
నార—(నవ్వును)

హిర—నవ్వెద రేమి?
నార—ఇచ్చ వేటచియున్న లాభమగపడదు నీవచ్చు టెఱింగియే యా
తఁడు వైకుంఠమున కేగియుండెను అతఁడింతలో వచ్చునట్లు
లేదు

హిర—నిజమేనా ! ముల్లోకాధినాధుడే నాకు వెరచిపరుగిడెనా !
యీలోకము గొప్పు బారినదా?
నార—ఓయీ నీతో బోరాడదగినవాడు వరుణదేవుడు. అతని
యొద్ద కేగుము
హిర—చిత్తము రణమునరింప నామనంబు తత్తరిల్లుచున్నది
(నిష్క్రమించును)
నార—ఈతని యాయుఃకాలము పూర్తియైనట్లు దోచుచున్నది వినాశ
కాలే విపరీతబుద్ధిః యనునట్లీతనికి విపరీతబుద్ధులు పుట్టుచున్నవి
ఏమిజరుగునో చూచెదగాక (17 పాడుచు నిష్క్రమించును)



ద్వితీయరంగము



[ప్రవేశము:-హిరణ్యాక్షుడు-వరుణుడు]
వరు—దానవేంద్రా ! కడుంగడు వ్యయప్రయాసలకోర్చి నీవిప్పట్టున
నిచ్చటికి రాగతమేమి యో ఎఱింగింపవీలగునేని యెఱింగింపుము
హిర—గదాయుద్ధమున నిన్నెదిరించినవాడు లేరని నారదుడు వినిపింప
నధికతరామోదంబునంది నేటికిగదా తగినప్రత్యర్థి దొరికెనని
సంతోషించి యిచ్చటి కరుదెంచితిని
వరు—[తనలో] నీతోడనా పోరొనరించుట నారదుడు నాకొంప
దీయ నెంచినాడు
హిర—ఆలోచించుచుంటివేమి?
వరు—ఓయీ !
చ మనమున శాంతిబూని నియమంబున సంగరముజ్జగించియే
వనయమున్నవాడ నిపు డాహవకేళి చరింపరాదు నీ

నాడు ఇంక నా మకుందుడు మాత్రము నాతో బోరుటకు
సమ్మతించునా?

(తెరలో వీణానాదము)

అదుగో ! నారదుని వీణాస్వనంబు వినవచ్చుచున్నది

[ప్రవేశము నారదుడు 9 పాడుచు]

నార—ఇచ్చటనే యుంటివేమి? వరుణునియొద్ద కేగలేదా !
హిర—ఏగితిని లాభమేమి?
నార—వరుణుడు యుద్ధమొసగింపలేదా ?
హిర—అవరుణుడు మాత్రము మీహిరణ్యాక్షునితో బోరసాహసించునా? ఆతడు దురమొనరింపలేక మొండిచేయిజూపుచు ముకుందునియొద్దకు బొమ్మనెను అందులకై వైకుంఠమున కేగుచుంటిని
నార—వలదు వలదు

చ గురుభుజుడమ్మహాత్ముడు వి ♦ కుంఠపురంబున నేడులేడు భూ
భరమువహింపనాదికిటి ♦ భావము దాల్చి రసాతలంబునం
దిరువుకనున్నవాడచటి ♦ కేగగనోపుదువేని నేగుమం
దరయుగగల్గు నీకునను ♦ రాంతకుతోడి రణంబ వశ్యము స్

హిర—ఏమీ ! వైకుంఠమునలేడా ! అట్లయిన రసాతలంబునకే బోయి యాతని సరసెదగాక (నిష్క్రమించును)
నార—వీడు నేడే హరిచేగూలగలవాడు యీ చరిత్రమును సాంగముగా జూచియే పోయెదగాక (నిష్క్రమించును)

(తెర యెత్తబడును రసాతలము)

(ప్రవేశము:- నారదుడు)

నార—(తనలో) ఆనారాయణదేవుని యవతారలీలల వర్ణింప నెవనితరంబు మున్న మత్స్యావతారమున సోమకాసురధమని జంపి బ్రా

ఆదువుల బ్రహ్మకిచ్చి సురాసురులు సముద్రమథన మొనరిం పుచుండఁగా క్రుంగిన గిరికిక్రింద నిలచి యాకుధరభారము వహించి దేవతల కమృతము నందగెను. నేఁడీరక్షాసాధముని జంప నాదికిటిరూపంబుదాల్చి యున్నాఁడు...(ఎదుటఁజూచి) అల్లదే అమ్మహానుభావుఁ డెదురులేని శౌర్యమున విహార మొనరించుచున్నాఁడు.

సీ. ఉదమొదళ్ళకు జక్కఁ • దునిసిపాఱగ మేర
గులశైలములజిమ్ము • గొంతతడవు
బ్రహ్మండభాండంబు • పగిలిచిల్లులుఁబోవ
గొమ్ములదాటిచు • గొంతతడవు
జలధులేడును బంక • సంకులంబై యింక
ఖురములమట్టాడు • గొంతదడవు
ఉడురాజు సూర్యుండు • నొక్కమూలకుబోవ
గుఱుచవాలము ద్రిప్పు గొంతదడవు
గీ. గిరియుగు ప్పించు లంఘించు • గొప్పరించు
నగయు ధరదివ్వ బోజీయగా • నేపురేగి
దానవేంద్రుని గుండెలు • తల్లడిల్ల
బంది మెల్లన రణపరి • పంధియగుచు

అల్లదే హిరణ్యాక్షు డీవంకకే వచ్చుచున్నాడు నేనామాటుననుండి వీరియుద్ధనైపుణ్యమును దిలకించెదగాక (నిష్క్రమించును)

[ప్రవేశము:- హిరణ్యాక్షుఁడు.]

హిర—(తనలో) అల్లదేముకుందుడు నాదికిటిరూపంబున నన్ను భయ పెట్టుటకుగాబోలు సముద్రమంతయు వ్యాకులపెట్టుచున్నాడు ఆ-ఆ-అదే నావశవర్తినియైనభూమిని దంష్ట్రాగ్రమున నిల్పి వినోదించుచున్నాడు గానిమ్ము వీనిపనివట్టెదగాక (ప్రకాశ

ముగ) ఓరీ! నారాయణా! వసివరాహరూపా!

క. నీవనకానిసీవీ ధరణిం
నానిపోకుము విషముగాక • కానియోఁగెదవే
గానిమొద నీపాణముగా
కాను బదెనాముమాట • కానేమిటికిస్. (నిష్క్రి)

(తెరయెత్తఁబడును) వ ర హా వ తా ర ము.

ఈహిరణ్యాక్షుఁడు విరించి దయనలంచి యొసంగినవరముల నుప్పొంగి భూవలయము నన్నుమించినవీరుఁడు లేడని గర్వించి యెల్లర బాధించుచు ప్రజాకంటకుఁడయ్యె వీనిని జక్కాడి లోకంబుల కుపకారమొనర్చెదగాక.

[ప్రవేశము:—హిరణ్యాక్షుఁడు]

(కం నీవనకాని...అను పద్యమును జదువుచు)

వరా—(సమీపించుచు)

మ. వినరా యోరి యమంగళాచరణయు • ద్వృత్తిన్నసుస్నీదు ధీ
ననయంబున్ వనగోచరంబగు మృగం•బందుం దలంతౌర నే
నెనయన్ వన్యమృగంబయాదుబలిమై • తాఁ తెంచు నీకోటియా
శునక శ్రేణివధింతు నేడని మొనన్ సాకోర్చి వర్తించినన్

చ. ననునెమరంగజాలి నఘు•నంబగు శౌర్యము ధైర్యమున్ బలం
బునుగలవేని నిల్వురణ • భూమిని నీహితులై వనారికిన్
గనుగవ బాష్పపూరములు • గ్రమ్మగమాన్పగనోపుదేని బ
య్యనజనబొమ్ము దానవకు•లాధమయూరక రజ్జులేటికిన్

హిర—ముకుందా! నీబీరంబులఁ జోనడచి నాతో జోరగలవేని విడుమగంటిమి గలదేని రణంబుననిల్వుము లేకున్న యింద్రాదులపగిది కాళ్ళకు బుద్ధిసెప్పి పరుగిడుము

వరా—ఛీ భుజాబలగర్వదురీదగ్ధా—ఆరణోచిదస్థలంబులకు రమ్ము—
(ఇరువురు నిష్క్రమింపగా నారదుడు-ప్రవేశము)

నార—ఏమి వీరి సమరనైపుణ్యము-యిరువురును వెనుకంజవేయక-
కాదు- కాదు_ హిరణ్యాక్షు డించుక వెనుక కేగుచున్నాడు.
లేదు. వెనుక కేగి తగరుకొండదాకినభంగి మరల హరిని దాకు
చున్నాడు. ఆ-చచ్చెను హిరణ్యాక్షుడు-లేదు నారాయణు
నిచే వ్రేటుపడి క్రిందపడెను. మరల లేచుచున్నాడు. క్రిందబ
డినను మాకేగె ౹పనినట్లు బీరంబులు పల్కుచున్నాడు- ఏమి
గుసగుసలు (పైకిజూచి) తెలిసినది జగద్వినుత పరాక్రమ శీలు
రగు నీవీరులు యుద్ధనైపుణ్యమును దిలకించుటకు దేవతలెల్ల
విమానరూఢులై గగనమార్గంబున నిలచియుండిరి. అదే
బ్రహ్మ ఏదో పల్కుచున్నాడు.

(తెరలో)

ఉ. అంచితదివ్యమూర్తి పర ♦ మాత్మక యీకలుషాత్ముడైన న
క్తంచరుడ దస్మదీయవర ♦ గర్వముసన్ భువనంబులెల్లగా
రించి మదించి యిట్టివిప ♦ రీత చరిత్రుడై దుర్గింపకిల్లుపే
క్షించుటగాదు వీనిబలి ♦ సేయు వసుంధరకుం శుభంబగున్.

నార—(తనలో) చతురాననుండు వీనినివధించి భువనంబులకుపకార
మొనరింపుమని ప్రబోధించుచున్నాడు గాని సంధ్యాకాలమే
తెంచుచున్నదని మెఱుంగక కాబోలును హరి వానితోక్రీడిం
చు చందంబున యుద్ధమొనరించుచున్నాడు.

(తెరలో]

మ. అనఘాయీయరుభిజ న్మహాత్ము మునదే ♦ వారాతి మర్దింపవే
శవయుంబున్ మఱిదైత్యవేళయగు సం ♦ ధ్యాకాలమే తెంచినన్

ఘనమాయాబలిశాలియైన దనుజుఁ • ఖండింపగా రాదుగా
భువనీవేళనఃత్రుంపుసజ్జనహిత • ప్రోద్యోగరక్తుండవై

నార—కమలాసనుఁ డదే దనుజునివధింపుమని దేవాదిదేవుని త్వర పెట్టుచున్నాడు. అదే. అదే. దేవదేవుండు చక్రిమందుకొని యారక్కసుపై విడచినాడు. దనుజుడు నేలగూలినాఁడు. ఆ దనుజాధముని దృక్కులింకను హరిపైననే యున్నవి.

ఉ॥ వరయోగీంద్రులు యోగమార్గముల నె • వ్వానిన్ మనోవీధి సు
స్థిరతన్ లింగశరీరభంగమునకై • చింతింతు రాపంకజో
దరు పాణ్యాహతి దన్ముఖాఁబురుహమున్ • దర్శించుచుం జచ్చెదు
ర్భరతోత్తముఁడు దైత్యవల్లభుని సౌ • భాగ్యంబు దానెట్టిదో

(తెరలేవగా హిరణ్యాక్షుని పై హరియుండును)

బ్రహ్మాదు లిరువంకలను జేరి స్తుతింతురు

బ్రహ్మ—
చం॥ తలపరసాతలాంతరగ • తక్షితి గ్రమ్మరనిల్పినట్టి నీ
కలితనమెన్న విస్మయము • గాదు సమస్తజగత్తులోలిమై
గలుఁగఁగ జేయుటద్భుతము • గాక మహోన్నతి నీవొనర్చు పెం
పలరిన కార్యముల్ నడప • నన్యులకుందరమే రమేశ్వరా !

ఇంద్రు—
ఉ॥ విశ్వభవస్థితి ప్రళయ • వేళలయందు నికారసత్వమన్
విశ్వము నీవయై నిఖిల • విశ్వము లోలి సృజింతువిందిరా
ధీశ్వర యాశ కేశవ త్రి • యామయదివ్య శరీరదేవ నీ
శాశ్వతలీల లిట్టివని • సన్నుతి సేయగమాకు శక్యమే

(తెరవాలును)



శ్రీ

# సంగీత విష్ణులీలలు.

## నరసింహావతారము.

### ప్రథమరంగము.

(ప్రవేశము.—హిరణ్యకశిపుఁడు, లీలావతి విత్రజిత్తి మొదలగువారు!)

హిర—నిన్నటిదినంబునుండియు చిరంజీవియగు ప్రహ్లాదునిఁ జూడవలయునని యుండుటచే కుర్రనిదోడ్కొనిరమ్మని చండామార్కులకు వార్తబంపితిను రాకుండిరేలకో గదా!

లీలా—అదే! కుమారుని వెంటబెట్టుకొని గురుపుత్రులు వచ్చుచున్నారు.

(ప్రవేశము:—ప్రహ్లాదుఁడు చండామార్కులు)

ప్రహ్లా—తండ్రి(కడకేగి) జనకా! నాకృతవందనము గొనుఁడు

హిర—లీలా-దీర్ఘాయుష్యమస్తు, గురుపుత్రా! ఉయాసన మలంకరింపుఁడు.

హిర—(ప్రహ్లాదుని దగ్గరగాదీసుకొని) కుమారా! నీవు గురువులకడ శ్రద్ధగా విద్యనభ్యసించుచుంటివా! గురువులకడ నీవిదివఱకెట్టి శాస్త్రముల నభ్యసించితివి.

ప్రహ్లా—తండ్రీ పెక్కుశాస్త్రముల జదివితిని గురువులెన్నిటినో జదివించిరి. ఈ చదువులు నిస్సారములు.

ఉ. ఎల్లశరీరధాతులకు • నిల్లను చీకటినూతిలోపలన్
ద్రొళ్ళితివీవు - నేనును మ తిభ్రమణంబు భిన్నులై పిన్న
త్రిల్లక సర్వమున్ నతని • దివ్యకళామయమంచు విష్ణుసం
దుల్లము( జేర్చి తారడవి • నుండుటమేలు నిశాచరాగ్రణీ.

హిర—ఏమిది నా వైరియగు నావెన్నుని గొప్పజేసి వర్ణించుచుంటివి
ఇత్యాది నీకెవ్వరుపదేశించిరి లేక నీకిదోచెనా?

శా. నాకుంజూడగ చోద్యమయ్యెడి గదా • నాతండ్రి యీబుద్ధి దా
నీకున్ లోపలదోచెనో పసులు దు • ర్నీతుల్ పఠింపించిరో
యేకాంతంబున భార్గవుల్ పలికిరో • యీదానవశ్రేణికిన్
వైకుంఠుండు కృతాపరాధుడతనిన్ • వర్ణింపనీకేటికిన్

మా [illegible] చెకర్!

మ. సురలందోలుటయో సురాధిపతులన్ • సృక్కించుటో సిద్ధులం
బరి వేధించుటయో మునిప్రవరులన్ • బాధించుటో యక్ష కి
న్నర గంధర్వవిహంగ నాగపతులన్ • నాశంబునొందించుటో
హరియించున్ గిరియాచు నేలచెనమో • హాంధుండవై పుత్రకా!

ప్ర—(గురునివైపుతిరిగి)

శా. అజ్ఞుల్ గొందఱు నేముదామనుచు మా • యాంజెంది సర్వాత్మకుం
బ్రజ్ఞాలభ్యుదురన్వయక్రమములన్ • భావింపగానేరరా
జిజ్ఞాసాపథమందుమూఢులుగదా • చింతింపబ్రహ్మాదివే
దజ్ఞుల్ తత్పరమాత్మవిష్ణునితరుల్ • దర్శింపగా నేర్తురే

చండా—నాయనా ప్రహ్లాదా! హరిభక్తిమానుము.

ప్రహ్లా—గీ. ఇనుమయస్కాంతసన్నిధి • నెట్లుభ్రాంత
మగు హృషీకేశసన్నిధి • నావిధమున
గరగుచున్నది దైవమో • గమునజేసి
బ్రాహ్మణోత్తమచిత్తంబు • భ్రాంతమగుచు.

మతియొక్క విశేషమాలోచింపుడు-

సీ. మందారమకరంద • మాధుర్యమునఁదేలు
మధుపంబుబోవునే • మదనములకు
నిర్మలమందాకి • నీవీచికలఁదూగు
రాయంచజనునె త • రంగిణులకు
లలితరసాల ప • ల్లవఖాదియై చొక్కు
కోయిలసేరునే • కుటజములకు
పూర్ణేందుచంద్రికా • స్ఫురితచకోరక
మరుగునే సాంద్ర నీ • హారములకు
నంబుచోదరుదివ్య పా • దారవింద
చింతనామృతపాన వి • శేషమత్త
చిత్తమేరీతి నితరులఁ • జేరనేర్చు
వినుతగుణశీల! మాటలు • వేయునేల?

చండా—ప్రహ్లాదా: మాచెప్పిన శాస్త్రములనెల్ల మంటగల్పితివా!

ఉ. పంచరద్వయస్కుఁడవు • బాలుఁడవించుకగాని లేఖ్య భా
షించెదు తర్కవాక్యములు • జెప్పినశాస్త్రములోని యర్థమిం
కించుకయైనఁజెప్ప వను • రేందు్రని ముందట మాకునాదలన్
వంచుకొనంగ జేసితివి • వైరివిభూషణ వంశదూషణా.

హిర—కుమారా; మనకులద్వేషియగు నాహరిని కీర్తించెదవేల నా
మాటలు వినుము హరిభక్తి మానుము మేలగును.

ప్ర—జనకా! ఆదిమధ్యాంతశూన్యుండును- రాజసాది గుణత్రయము
విరాజితుండును- చిరశుభాకారుండును- మోక్షసంధాయకుం
డును- అగు నాదేవదేవునకు- వీరు- వైరులనియు వారుహితు
లనియు భేదమున్నదా! బుద్ధిహీనులమై మనమట్లు దలఁచుచుం
దుము[illegible]త్మ్మవ కట్టిదెన్నటికిని లేదు. విశ్వీలికా

బ్రహ్మాదియంతమాతడు సమంబుగ నెల్లర సమదృష్టినారయు
చుండును.

హిర—ఛీ! దురాత్మా! నాకే బుద్ధులుగరపుచుంటివా!

చ. తనయుఁడుగాడు శాత్రవుఁడు • దానవభర్తకువీఁడు దైత్య చం
దనవనమందుఁ గంటకయు • తక్షితిజాతముభంగి బుట్టె నా
డనవరతంబు రాక్షస కు • లాంతకు బ్రస్తుతి సేయుచుండు దం
డనమునఁ గాని శిక్షలకు • డాయఁడు పట్టుఁడు కొట్టుఁడుద్ధతిన్.

చండా— దనుజేంద్రా! మాపల్కు లాలించుము. ఈతఁడింకను పసివాఁడు దండనమున కాఁగలేడు గాన మరల దోడ్కొనిపోయి మా నిపుణత్వమంతయు జూపి గోపించియో దండించియో జదివించి యీపాడు హరిభక్తి మానునట్లొనరింతుము.

లీలా—నాథా! చండామార్కులు జెప్పినవిధంబున వర్తించుటయె కర్తవ్యము. యింకను ముక్కుపచ్చలారని యీచిన్నపాప దండించినచో లాభముండునా! కొంచెము ప్రాజ్ఞుఁడైనచో నేమేని బుద్ధిదెచ్చుకొనునేమోగదా!

హిర—మంచిదట్లనేగానిండు-గురుపుత్రా! మీ యిచ్చవచ్చిన తెఱంగున వీనికి బోధించి హరిభక్తి మానునట్లొనరింపుఁడు.

(చండామార్కులు ప్రహ్లాదులు నిష్క్రమింతురు)

హిర—ప్రాణేశ్వరీ! రమ్ము లోనికేగుదము-నేడునామనంబన్యాక్రాంతమై యొకవిధమగు విచారముచే నావరింపబడినట్లున్నది.

(నిష్క్రమింతురు- తెరవ్రాలును)

## ద్వితీయరంగము.

(హిరణ్యకశిపుఁడు చండమార్కులు ప్రహ్లాదుఁడు దూరముగ నుండఁగా తెరలేచును.)

చండ — నాయనా! ప్రహ్లాదా! నామాటవినుము. నీతండ్రియెదుట విష్ణుని వర్ణింపకుము - నామాటవినుము - మాకు దలవంపులు దేకుము. కనుసన్నల మెలఁగి నీతండ్రియిష్టానుసారము వర్తించుము- ఈపాడుహరిభక్తి కీర్తనలపద్యముల నీతండ్రిచెంతఁ బాడకుము.

ఉ. త్రిప్పకుమన్న మావచను • దీర్ఘమునైన శ్రీవరిపాకముల్
దప్పకుమన్న నేఁడుమన • దైత్యవరేణ్యుని మ్రోలనేము మున్
జెప్పిన నీతిగానిమతి • సెప్పకుమన్న విరోధినీతులన్
విప్పకుమన్న దుష్టమగు విష్ణుచరిత్రకథార్థజాలముల్.

అదే నీతండ్రి నమస్కరింపుము. దానవసార్వభౌమా! నీకుమారుని సకలనీతిశాస్త్ర పారంగతుఁ జేసి దోడ్కొనివచ్చితిని.

క. శిక్షించితిమన్యములగు
పక్షంబులుమాని నీతి • పారగుఁడయ్యెన్
రక్షోవంశాధీశ్వర
వీక్షింపుము నీకుమారు • విద్యాబలమున్

ప్ర — జనకా! నమస్కరించుచున్నాఁడను.

హిర — కుమారా! దీర్ఘాయుష్మంతుఁడవై యుండుము. (అని దగ్గరకు దీసికొని ముద్దుగొని తొడపైఁ గూర్చుండఁబెట్టుకొని) ఇంతకాలము దనుక నీవేమిచదివితివి గురువులేమిబోధించిరి

శా. చోద్యంబయ్యెడి నింతకాలమరిగెన్ • శోధించియేమేమి సం
వేద్యాంశంబులు సెప్పిరో గురువులే వెంటంబఠింపించిరో

విద్యాసార మెఱుంగఁ గోరెదభవ ♦ దివ్యాకశాస్త్రాంబులోఁ
బద్యంబొక్కటి సెప్పి సార్థముగఁ దా ♦ త్పర్యంబుభావింపుమా.

వ్రి—జనకా! గురువులెన్నియో శాస్త్రములు సెప్పిరి నేను జదివి
తిని చదువులలోని సారమును గూడఁగంటిని.

క. చదివించిరి నను గురువులు
చదివితి ధర్మార్థముఖ్య ♦ శాస్త్రంబులు నే
జదివినవి గలవు పెక్కులు
చదువులలో మర్మమెల్ల ♦ జదివితి తండ్రీ.

హిర—నాయనా! మంచిది. ఆపాపహారిభక్తి మాని శాస్త్రంబుల
నెల్లజదివి సారముగ్రహించితివా! మంచిది. యింక నెన్నడును
నావిష్ణుని గీర్తింపకుము. నీవు నేర్చినసార మెద్దియో నాకుఁ
గూడ విన్పింపుము.

వ్రి—జనకా! ఆలించుము.

సీ. కమలాక్షునర్చించు ♦ కరములు కరములు
శ్రీనాథువర్ణించు ♦ జిహ్వ జిహ్వ
సురరక్షకుని జూచు చూడ్కులు చూడ్కులు
శేషశాయికి మ్రొక్కు ♦ శిరము శిరము
విష్ణు నాకర్ణించు ♦ వీనులు వీనులు
మధువైరి దవిలిన ♦ మనము మనము
భగవంతువలగొను ♦ పదములు పదములు
పురుషోత్తముని మీఁది ♦ బుద్ధిబుద్ధి
దేవదేవుని జింతించు ♦ దినము దినము
చక్రహస్తుని బ్రకటించు ♦ చదువు చదువు
కుంభినీధవుజెప్పెడి ♦ గురుఁడు గురుడు
తండ్రిహరిజేరు మనియెడి ♦ తండ్రి తండ్రి

జనకా ఆలించుము విష్ణుభక్తిలేని మానవుడు మానవుడే

సీ. కంజాక్షునకుగాని ♦ కాయంబు కాయమే
పవనగుంభిత చర్మ ♦ భస్త్రిగాక
వైకుంఠుఁబొగడని ♦ వక్త్రంబు వక్త్రమే
ఢమఢమధ్వని తోడి ♦ ఢక్కగాక
హరిపూజనములేని హస్తంబు హస్తమే
తరుశాఖ నిర్మిత ♦ దర్విగాని
కమలేశు జూడని ♦ కన్నులు కన్నులే
తనుకుడ్యజాల రం ♦ ధ్రములుగాక
చక్రిచింతలేని ♦ జన్మంబు జన్మమే
తరళసలిలబుద్బు ♦ దంబుగాక
విష్ణుభక్తిలేని ♦ విబుధుండు విబుధుఁడే
పాదయుగముతోడి ♦ పశువుకాక.

జనకా! సంసారవారాసిలో జిక్కుకొనిన మానవులకు విష్ణుభక్తిలేకున్న మోక్షములభించునా!

సీ. సంసారజీమూత ♦ సంఘంబు విచ్చునే
చక్రిదాస్యప్రభం జనములేక
తాపత్రయాభీల ♦ దావాగ్నులారునే
విష్ణుసేవామృత ♦ వృష్టిలేక
సర్వంకషాఘౌఘ ♦ జలరాసులింకునే
హరిమనీషా బడ ♦ బాగ్నిలేక
ఘనవిపద్గాఢాంధ ♦ కారంబులడగునే
పద్మాక్షునుతిరవి ప్రభలులేక
నిరుపమానపునరావృత్తి ♦ నిష్కళంక
ముక్తినిధిఁ గానవచ్చునే ♦ ముఖ్యమైన

శార్ఙకోదండ చింతనాం ♦ జనములేక
తామరసగర్భునకునైన ♦ దానవేంద్ర

హిర—(మండిపడుచు) ఓరీ ! దుర్మతీ ! (కుమారునిక్రిందికిద్రోసి) నా యెదుట యిట్లు నావైరినివర్ణింప సాహసించిన నిన్ను పుత్రవ్యామోహామునబడి మన్నించితినిగాని లేకున్నచో నీపాటికి నా ఖడ్గమున కెరవైయుందువు. ఎంతగా మీరిపోయితివి. ఇట్టికులద్రోహివగుదువని కలనైనం దలంపనైతిగదా ! అయినను యిందు నిన్నువలసినదిలేదు.

ఉ. పటుతరనీతిశాస్త్ర చయ ♦ పారగుజేసెదనంచు బాలునీ
పటుగొంపోయి వానికి న ♦ వర్ణ్యములైన విరోధిశాస్త్రముల్
కుటిలత జెప్పినాడవు భృ ♦ గుపుత్రవరుండవటంచు నమ్మితిన్
గటకటబ్రాహ్మణాకృతివి ♦ గాక యథార్థపు బ్రాహ్మణుండవే.

చండా—దానవేశ్వరా నాపైన నలుగకుము.

ఉ. తప్పులులేవు మావలన ♦ దానవనాథ విరోధిశాస్త్రముల్
చెప్పము క్రూరులైపరులు ♦ చెప్పరు మీచరణంబులాననను
మ్మెప్పుడు మీకుమారునకు ♦ నింతయు నైజమనీష యెవ్వరుం
జెప్పెడి పాటిగాదు ప్రతి ♦ చింతదలంపుము నేర్పుకైవడిన్.

హిర—ఓరిడింభకా ! గురుపుత్రు లుపదేశింపని యీ దుర్మతము నెవ్వరుపదేశించిరి. వారల బేర్కొనుము తత్క్షణము వారిని ద్రుంచెదను.

ప్ర—జనకా !

ఉ. అచ్చపుజీకటిన్ బడి గృ ♦ హవ్రతులై విషయప్రవిష్టులై
చచ్చుచు బుట్టుచుండ మరల ♦ చర్వితచర్వణులైనవారికిన్
జెచ్చెరబుట్టనే పరులు ♦ జెప్పిననైన నిజేచ్ఛనైననే
మిచ్చ సనైన గానలకు ♦ నేగిననైన హరిప్రబోధముల్.

ఇతరుపదేశించినంతమాత్రమున విష్ణుభక్తి యులవడునా! పూర్వకర్మసంచితంబుగ దనంతనదియే యుద్భవింపగలదు.

హిర—ఏమీ! నీపొగరుబోతు సమాధానము. కానిమ్ము. యిట్టిప్రగల్భవాక్యము లాడువారలను మన్నింపరాదు.

శా. అంగవ్రాతములోఁ జికిత్సకుఁడు దు ♦ ష్టాంగంబు ఖండించి శే
షాంగశ్రేణికి రక్ష సేయుక్రియనీ ♦ యజ్ఞున్ గులద్రోహి దు
స్సంగుం గేశవపక్షపాతి నధమున్ ♦ జంపించి వీరవ్రతో
త్తుంగఖ్యాతిఁ జయించెదం గులముని ♦ ర్దోషంబు గావించెదన్

దానవులారా! రండు-యీతుచ్ఛునిఁ గొనిపోయి మీయిచ్చవచ్చినట్లు బాధింపుడు. కొట్టుడు కొట్టుడు హరిభక్తి మానివేయుదుననువఱకు. మీయిచ్చవచ్చినట్లు శూలములచేఁ బొడువుడు గదలచే మొత్తుఁడు.

[ప్రవేశము:—యిరువురు రాక్షసులు]

ప్ర—జనకా! శ్రీమన్నారాయణ చరణారవింద మరందపాన పారవశ్యంబున దేలుచున్న నా కెట్టియాపదలును గానేరవు.

హిర—(దానవులతో) ఈద్రోహినిఁ గొంపొండు.

ప్ర—శ్రీహరీ! శ్రీహరీ! (దానవులు దోడ్కొనిపోవుదురు)

హిర—(తనలో) ఎంతజెప్పినను వినడయ్యెను. కడకా దనుజులు యువరాజని సంశయింపక తమయిచ్చవచ్చినరీతిఁ బాధింపుచున్నను సహించుచు శ్రీహరీ! శ్రీహరీ! యనినుతించునుగాని యించుకంతయు దైన్యమొందడు.

ఉ. శూలములన్ నిశాచరులు ♦ సుక్కఁగ దేహము నిగ్రహింపగా
బాలుఁడు నేలపైఁబడఁడు ♦ పాఱఁడు చావఁడు తండ్రినైన నా
పాలికివచ్చి, చక్రధరు ♦ పక్షముమానితినంచు పాదముల్
ఫాలముసోక మ్రొక్కఁడన ♦ పాయత నుండుట కేమిహేతువో.

చండా—(రాజు యభిమత మెఱింగి) రాజేంద్రా! నాపలుకు లాల
కింపుడు. శుక్రాచార్యులవారు వచ్చునంతవఱ కీతని నింక బా
ధింపకుము. వారు వచ్చిరేని తగుమార్గములబోధించి విష్ణు
భక్తి విడచునట్లు జేసెదరు. అంతవరకు మేముగూడ వేయి
విధంబుల యత్నించుచునే యుందుము.

హిర—అట్లొనర్చుడు—రండాతని దోడ్కొని వెడలుదురుగాక.

(నిష్క్రమింతురు)

(తెర పడును)

## తృతీయ రంగము

—:పాఠశాల:—

(చండామార్కులు—ప్రహ్లాదుడు—యితర బాలురు)

చండా—ప్రహ్లాదా! ఆహరిభక్తిమాని తిరంబుగ నా నేర్పు త్రివర్గ
పాఠముల జదువుచుండుము. నీతోడి బాలురచేగూడ జదివిం
చుచుండుము. జపతపంబుల నిర్వర్తించుకొని యొక్కగడియ
లోవచ్చెదను. (నిష్క్రమించును.)

1 బాలుడు—పంతులు వెళ్లినాడు. పుస్తకములు మూలపారేయ్యండి
ఆడుకుందాము రండి.

2 బాలుడు—నీకెప్పుడు ఆటలేకాని చదువక్కఱలేదు.

3 బాలుడు—నువ్వు మా చదివేసినావు లెద్దూ.

4 బాలుడు—ప్రహ్లాదా! ఆడుకొనుటకు వచ్చెదవా!

ప్ర—బాలకులారా! ఆలించుడు. ఆటపాటలతో కాలమును వ్యర్థముచే
యకుడు. సకలజన్మంబులలో మనుష్యజన్మంబుత్తమము. అయ్యది
యు శతవర్ష పరిమితంబైన జీవితకాలంబున నియమితంబైయుండు

అందు సగమంధకార బంధురంబయి రాత్రియామంబున నిద్రా దివ్యవహారంబున నిరర్థకంబగు చిక్కిన యేబదివత్సరంబుల బాల్యకైశోరకౌమారాదివయోవిశేషంబుల యిరువదివత్సరంబులు గతించును, మిగిలిన ముప్పదివత్సరంబులందును నింద్రియంబులచేతఁ బట్టుబడి యరిషడ్వర్గంబులకుఁ జిక్కి దన్మధ్యంబు నుండి వెలువడజాలక నాశాపిశాచంబుచే నావహింపబడి ధనకనకవస్తువాహనంబులను బాంధవులను ప్రేయసిని వర్జింపనేరక నిర్గమద్వారశూన్యంబగు మందిరంబున నుండి వెడలెడు మార్గంబుగానక చింతించు కీటకంబు చందంబున గృహస్థుండు స్వయంకృత కర్మపాశబద్ధుడై మోక్షసాధనంబులగు మార్గంబుల గుర్తెఱుఁగక, రమానాథచరణారవింద గంధరసాస్వాదనంబెఱుఁగక మూఢుడై దండధరుమందిర ద్వారగేహళీజాజ్వల్యమానమై తరంగిణీవహనదారుణజ్వాలాజాలదందహ్యమానదేహులం గూడి శిక్షిత్రావగాహంబుల నొందుచుండును. ఏపురుషుండు యరిషడ్వర్గంబుల జయించి మనోనిగ్రహుండై తనహృదయపద్మంబున నారమాకాంతుని పాదపద్మంబుల నిడుకొని సేవించుచుండునో యాపురుషుండు మోక్షలక్ష్మినిగైకొని సర్వకాల సర్వావస్థల నాశ్రీమన్నారాయణుని చెంతనివసించియుండు గాన మోక్షార్థియైనజీవి - తన యిచ్చవచ్చినరీతి గాలంబును వృథసేయక తుచ్ఛంబులగు నిహసౌఖ్యంబుల కాశజేయక - దేహావసాన పర్యంతము నారాయణుని సేవించుటయె కర్తవ్యము.

1 బాలుడు — ప్రహ్లాదా! ఆతడెట్టివాఁడు—ఎచ్చోటనుండును.

2 బాలుఁడు—ఆతనిమెప్పించుటెట్లు?

3 బాలుఁడు—మోక్షంబుసాధించుటెట్లు?

4 బాలుడు—ఈప్రశ్నల కుత్తరమిచ్చినచో మేముగూడ హరిభక్తులమై యుందుము.

ప్ర—ఆనారాయణుండు కరుణాప్రపూరితుండై యెల్లర సమదృష్టి నీక్షించుచుండును పృథివ్యాప్ తేజోవాయు రాకాశంబులందును భూతవికారంబులయిన ఘటపటాదులందును సకల చరాచరస్థూలసూక్ష్మజీవసంఘంబులందును రజస్తత్వతమో గుణంబులందును గుణరహితంబైన మహాత్త్వాదియందును బెక్కురూపంబులరూపశూన్యుండై-యుండియు లేనట్టుల వెలంగుచుండును. పెక్కుమాటలేల-ఆనారాయణదేవుండు లేనిస్థలంబుగాని వస్తువుగాని యేలోకంబునందున లేదు. అదికారణంబుగ మనము సర్వభూతములందును సుహృద్భావంబుగలిగి వర్తించిన నధోక్షజుండు పరమానందంబునొందును ననంతుండును నాద్యుండును నగునాహరి సంతసించి తనకృపా దృక్కిరణంబుల మనపైం బ్రసరించిన నింక మనకుం గావలసిన దేమున్నది. జనార్దనచరణ సరసీజయుగళ సంస్మరణ సుధారస పానప్రమత్తులమైనచో వకాంక్షితంబుగ మోక్షలక్ష్మి తనంతిదానె మనలవరించితీరును.

1 బాలుడు—నీచెప్పినది సమంజసముగానున్నది

2 బాలుడు—మేముగూడ హరిభక్తుల మయ్యెదము

ప్ర—అయినచోరండు హరినిభజింతము (10)

(ప్రవేశము:—చండామార్కుండు)

చండ—పాఠశాలయంతయు నల్లకల్లోలముగాన న్నదే. (పరికించి) అహా మించివచ్చినది ఎల్లరును విష్ణుభక్తులైరి ప్రహ్లాదుని మూలమున రాక్షసబాలు రెల్లరును పాడగుచుండిరి భూకాంతుప కిత్యాది యెఱిగింపకున్న మహప్రమాదటిల్లగలదు- (ప్రహ్లాదు

ని సమీపించి బలవంతముగానాపి) చాలుచాలు మంచిపని జేసి
తివి యీరీతిగానేనా పాఠములు జదువుట రమ్ము. నీతండ్రితో
నీ వృత్తాంతమంతయుజెప్పి నిన్ను తగినట్లు శిక్షింపజేతును.
రమ్ము    ప్రహ్లాదుని దోడ్కొని నిష్క్రమించును)

(ప్రవేశము :- హిరణ్యకశ్యపుడు)

హిర—(తనలో ప్రహ్లాదునకేమని బుద్ధివచ్చియుండునా! అకటకటా! ఆపాదు హరిభక్తిగాక వీనియందొక దుర్గుణములేదే! యిట్టి సుగుణరాసిని నిష్కారణముగా బాధించితి- బాధించితి- కన్న కుమారుడని- మానసమున నించుకేని కనికరింపక బాధించితి- అయినను-నాయెడలఁగలభక్తి వీడక విష్ణుభక్తిపరాయణుడై జరించుచుండెనే ! ఇంక వీనిని నెట్లుస్వాధీనమొనర్చుకొందును. (ఆలోచించి) పసిబాలుఁ డెక్కడ ఘోరబాధలకోర్చియుండు టెక్కడ- నాశాత్రవుండగు నాహరి-నాసోదరుని యమలోకంబున కంపిన హరి వీనియం దావేశించియుఁడి యాబాధల సహించుచు బాలకుని గాపాడుచుండెను. ఓసీ ! నా మగుణ రూపహీనా ! నీకండకావర మడగించెదలెమ్ము నాఘాతకు వెరచి డాగొనిన నిన్నే సంహరింపజాలనియెడ కమలాసనదత్త మాహాత్మ్యపుష్టవరప్రభావమోదుంటకు - దుర్మతీ ! తత్తరపడకుము యీహిరణ్యకశ్యపు డింతలో శాంతివహింపజాలడు.

(ప్రవేశము:—తొందరతో చండామార్కులు)

హిర—ఏమిది గురుదేవా ! యింతతత్తరబాటున నరుదెంచితిరేమి? చిరంజీవి విష్ణుభక్తిమానెనా ! లేదా !

చండ—దానవసార్వభౌమా ! కొంపమునుగునట్లున్నది- నీకుమారునిమూలముగా తక్కుంగల బాలకులుగూడ పాడగుచుండిరి

శా. రక్షోబాలురనెల్ల నీకొమరుఁడు చే • రంజేరి లోలోననా
శిక్షామార్గములెల్ల గుల్లలని యాక్షేపించి తానందఱన్
మోక్షాయత్తులజేసినాఁడు మనకున్ • మోసంబు వాటిల్లె నీ
దక్షత్వంబున జక్కఁజేయవలయున్ • దైతేయవంశాగ్రణీ !

హిర—తానుచెడినదేగాక వారలగూడ జెరుపయత్నించెనా ! మీ
రంతటశిక్షించి నీకిది తగదని బోధింపలేదా !

చండా—నేను జపంబు నిర్వర్తించుకొని పాఠశాల కరుదెంచునప్పటి
కి బాలురెల్లరును తన్మయత్వముతో బాడుచు నాడుచుండిరి.
అతికష్టముపై నీతనయుని బట్టినిల్పి యిదేమని ప్రశ్నించగా
నాకుఁ గూడ విష్ణుభక్తియుపదేశింప బ్రారంభించెను. అంత
జేయునది లేక యీవృత్తాంతము తమ కెఱుఁగఁజేయవచ్చితిని
ప్రహ్లాదుని యల్లదే గుమ్మముకడ నిలిపితి.

హిర—(కోపమున) ఓరీ ! డింభకా ! పుత్రుడవని కనికరముజూపిన
కొలదియు నెత్తిపై కెక్కి తాండవించుచున్నాడవా ! ఓరీ
అలంబసా ! ప్రహ్లాదు నిట్లీడ్చుకొనిరమ్ము.

(ప్రవేశము.-ప్రహ్లాదుఁడు అలంబసుఁడు)

హిర—ప్రహ్లాదా ! కడసారిగా నడుగుచున్నాను. విష్ణుభక్తిమానెద
వా ! నాఖడ్గమున కెరయయ్యెదవా ! జెప్పుము కులాచార
ధర్మంబులఁ బోవిడిచి నీపినతండ్రిని వరాహరూపంబున జంపిన
యద్దురాత్ముని బట్టువలె నేలవర్ణించెదవు

ప్ర—జనకా ! ఆమహాత్ముని యూరకనిందించెదవేమి యిటువినుము
నాపినతండ్రియొనర్చిన ఘోరపాపమే యాతనిని వరాహరూ
పంబున జక్కాడినది. నారాయణదేవునకు రాగద్వేషములు
లేవు.

హిర—దురాత్మా ! (అనితన్నుచున్నాడు)

ప్రి—శ్రీహరీ!

హిర—ఛీ! నోరుమూయుము హరియను వాఁడెవ్వఁడునులేడు. ఉన్న చో తనహితులైన దిక్పాలురఁజంపి చెండాడునాడు నిందుఁ గఁటిమిఁగలవాఁడైనచో నాతోఁబ్రతిఘటించి నిలువకుండునా.

ప్రి—జనకా! కామక్రోధాదుల జయించి యింద్రియంబులఁ జక్కఁబడకఁ జతురులై వర్తించు పుణ్యచరిత్రులకుగాని నీవంటి వారలకు గోచరింపఁడు.

హిర—ఓరీ దుర్మతీ! నీమందమతి యింకను మేరమీరుచున్నదే (అని సురలదన్ని) ఓరీ! అలంబసా యొక్క పాములవానిని బిలిపించి • క్రూరసర్పములచే వీనిని నాయెదుట గరపింపుడు.

ప్రవేశము:—లీలావతి 11 పాడుచు)

లీలా—నాథా యించుక కరుణింపుడు. కుమారుని- నవమాసంబులు గర్భమందుదాల్చి గనిన నాకుమారుని- యీముక్కువచ్చులారని ముద్దుకుఱ్ఱని- మనవంశలతాంకూరుని- చంపించుటయేనా! అందునను- అజ్ఞానముచే పసితనమున- విష్ణుని ధ్యానించుచుండెనను మిషపైఁ గన్నులయెదుటనే జంపించుటా! ఇంతకన్న ఘోరమున్నదా! కుమారా! ఇంతపట్టుదలయేల? (12)

నామాటవినుము. నీతండ్రి బోధించుమార్గమునఁ బొమ్ము. విష్ణుభక్తి మానుము నీయభ్యుదయముఁ గోరెడి నాకు సుఖమొసఁగూర్పుము. జనకునితో వైరమునీకుఁ దగునా! తండ్రీ! నామాటవినుము హరిభక్తిమానుము.

హిర—ఏమిరా! యిచ్చటనుండి కదలవు. వెంటనే పాములవానిని దోడ్కొనిరమ్ము. (అలంబసుఁడు నిష్క్రమించును.)

లీలా— (13 అనుబంధము.)

నాథా! నాథా! నాయేకపుత్రుని మన్నింపరా! మన్నింపకున్నమా

నా యావజ్జీవము బందెలోనుంచుదుగాని నాకు పుత్రశోక
మనుమాత్రము గల్గింపకుము. (వేడుకొనును)

హిర—అద్దురాకుము. (త్రోః వేయును)

(ప్రవేశము:—అలంబసుడు, పాములవాడు)

హిర—ఓరీ! నీయొద్ద మంచిపాములేమైననున్నవా!

పాము—చిత్తంబాబూ చిత్తం. మామేలు పాములుండాయిబాబు!

హిర—చూపుము.

పాము—ప్రభోరుసిత్తగించండి ఇదో సూడండి యీనల్లసుక్కల తా సునండి-మన్నంకొండలోనండి-తిరిగి తిరిగి మూణ్నెళ్ళ కాసి మరీపట్టుకున్నామండి - ఈగోధుంతాసును చూడండి ప్రభో మొన్ననండి పదిమందోచోట కూకుంటె యెనకపాటనొచ్చి ముగ్గురు పానాలుచ్చుకొని బొక్కలో దూరిందండి అప్పుడునా నెంతో కట్టబడి దీన్నట్టకున్నా.

హిర—ఈరెండుపాములచేతను ప్రహ్లాదుని గరిపింపుము.

లీలా—నాథా! నాథా! కరుణింపరా! కుమారునిపైఁగనికరముంపరా! కుమారా! ప్రహ్లాదా! నీవైన నాపల్కులాలింపవా!

ప్ర—అమ్మా! యేలశోకించెదవు. శేషాహితల్పుండగు నాశ్రీహరినే ధ్యానింపుచు- స్మరించుచు కీర్తింపుచున్న నన్నికూర పన్నగంబు లేమిచేయఁగలవు. యించుక యూరడిల్లుము కాని నాకైన్నను విష్ణుభక్తి మానుమని బోధింపకుము. వలయునేని యీ దేహమును ప్రాణమును సమర్పించెదగాని హరిభక్తిని మాత్రము మానజాలను.

లీలా—హాకుమారా! (మూర్ఛిల్లును)

హిర—ఓరీ! ఆలస్యమేలచేసెదవు. ఆపాములచే వానిఁగఱపింపుము.

పాము—సిత్తం సిత్తం. (నాగస్వరము పట్టుచుండును)

ప్ర—జనకా!

కం. బలయుతులకు దుర్బలులకు
బల మెవ్వఁడు నీకు నాకు ◆ బ్రహ్మాద్యులకున్
బల మెవ్వఁడు ప్రాణులకును
బల మెవ్వం డట్టివిభుఁడు ◆ బలము నరేంద్రా!

ఆశ్రీహరియే వచ్చి గాపాడగలఁడు.

హిర—ఛీఛీ! వదరకుము.

శా. నాకోపంబు ప్రతిభాషలాడెదవు రా ◆ న్నాథుండ నాకంటె నీ
భ్రాతృశ్రేణికి రాజులేని పోకకు సం ◆ పూర్ణప్రభావుండు నా
ద్వాత్రింశజ్జనసమున్నతే వెదకితిం ◆ బల్మారు నారాయణున్
జేతఃస్ఫూర్తిని లేఁడు చూడ ◆ వాఁ డెచ్చుండురా దుర్మతీ!

నామరూపములు లేని హరి యెక్కడనుండును గా.

ప్ర—జనకా! సర్వభూతాంతర్యామిత్వ సంగతుఁడైన యా శ్రీహరి
లేని స్థలంబు లున్నవా!

మ. కలఁ డంభోధిఁ గలండు గాలిఁ గలఁ డా ◆ కాశంబునం గుంభినిం
గలఁ డగ్నిన్ దిశలం బగళ్ళ నిశలన్ ◆ ఖద్యోతచంద్రాత్మలం
గలఁ డోంకారమునం ద్రిమూర్తుల ద్రిలిం ◆ గవ్యక్తులం దంతటం
గలఁ డీశుండు గలండు తండ్రి వెదకం ◆ గానేల నీ కీయెడన్.

ఇంకను వినుము.

కం. ఇందుగలఁ డందు లేఁడని
సందేహము వలదు చక్రి ◆ సర్వోపగతుం
డెందెందు వెదకిజూచిన
నందందే కలఁడు దాన ◆ వాగ్రణి వింటే.

హిర—ఓరీ!

కం. డింభక సర్వస్థలముల
సంభోరుహనేత్రుఁడుండు • ననుచు నిగుల సం
రంభంబున బలికెద నీ
స్తంభంబునఁ జూపఁగలవె • చక్రిన్ గిక్రిన్.

ప్ర—జనకా! సందేహమేల?

శా. అంభోజాసను డాదిగాఁ దృణ • ర్యంతంబు విశ్వాత్ముఁడై
సంభావంబున నుండు ప్రోడ ఘనుల • స్తంభంబు నందుండడే
స్తంభాంతర్గతుఁ డయ్యు నన్నుఁ గరుణన్ • సందేహమున్ లేదు ని
ర్దంభత్వంబున నేఁడు గానఁబడు బ్రో • త్యక్ష స్వరూపంబునన్.

హిర—ఇందా హరి లేకున్నచో నేఁడు నీచావు నిక్కము [స్తంభము
ను గొట్టెను.]

[స్తంభము పగిలిన నరసింహావతారము]

హిర—ఓహో! దుర్మతీ నాయనుజుని జంపి యెదో దాగియుంటివి.
రమ్ము నా ప్రతాపముగ ఓర్చుకొందును. కుమారా నీవు
విరోధిని కీర్తించుచుంటివని కొంటెంగాని నా ప్రత్యర్థిని ఎందు
జూచినను గానరాని యీ మాయావిని నాకు జూపుమనని
తెలిపితిని కుమారా చిరకాలము వర్ధిల్లుము

నృసింహమూర్తి—ఓరీ దురాత్మా హిరణ్యకశ్యపా నేటితో నీ యాయుః
కాల మంతరించినదిరమ్మ [తొడలపైనిడుకొని చీల్చిచంపును]

ప్ర—(16)

(తెర వ్రాలును)





శ్రీ

# సంగీత విష్ణులీలలు.



## వామనావతారము.



(ప్రవేశము:—శుక్రాచార్యులు బలి.)

బలి—గురువరేణ్యా! ఈదినంబున నొక్క యతిథియైన రాకుండుటఁ జూడ కడుంగడు వింతగాఁ దోఁచుచున్నది.

శుక్రా—వింతగనుండుట కేమున్నది.

చ. అసురకము న్నసిప్రు విప్రు • లార్థములన్ వెదజల్లి కోర్కెలన్
దడయకఁ దీర్చునంచు వ్రతి • ధారణసేసి చరించుచుండగా
గడచెను నెక్కుమాసములు • గాన దరిద్రులు కంటికైనగ
న్పడరని నూనానేసి నడు • వంచిగు దైత్యకులావతంసమా!

కోటి కొక్కడైనను యాచకుఁ డుండియుండునా యని సందియము నీ కుండిన యుండవచ్చునుగాని నేనుమాత్ర మట్లు దలంపను.

బలి—గురూత్తమా! అట్లు శలవీయకుఁడు. ఎక్కరు విప్రులింకను దరిద్రదేవతాపీడితులై యుండియుందురు వారెల్లరును యీధనంబులను మన మన్యాయముగా నిందుసి పీచ మడచి నంపాదించినదని ప్రతిగ్రహింప సంశయపడియుందురు.

శుక్రా—ఇంద్రాదులనుటచే జ్ఞప్తికివచ్చినది. వారలమాత్ర మేమరి యుండగూడదు సుమా! ఏమందువా! తా మెవ్వరిచేనైన బాధింపబడినప్పుడెల్ల వారావారియొద్దకేగి కల్లబొల్లి యేడ్పు

లచే నాతని మనంబును గరగించి యాతనిచే నభయంబును బొందుచుందురు. అట్లనే వారు నేఁడును బయలుదేరిపోయి యుండవచ్చును.

(ప్రవేశము — వామనుఁడు.)

వామ—(చేయిజాపి)

ఉ. స్వస్తిజగత్త్రయీభువన • శాసనకర్త మహాసమిత్రవి
ధ్వస్తనిలింప భర్తకును • దారపదవ్యవహర్తకుఁగా మనీం
ద్రస్తుత మంగళాధ్వరవి • ధానవిహర్తకు నిర్జరగళ
న్యస్త సువర్ణ సూత్రపరి • హర్తకు దానవలోక భర్తకున్.

బలి—(వీకముడిగ్గి తనలో) ఈతఁ డెవ్వఁడో యర్థాపేక్ష నిట్లు సుదెంచి నట్లు బొడగట్టుచున్నది. (ప్రకాశముగ) ఈపీఠనుం దాసీనులు గండు.

శుక్రా—(తనలో) ఈమరగుజ్జురూపుం డెవఁడోగదా!

బలి—ప్రియా! యుదకంబును గొని తెమ్ము.

(ప్రవేశము:—రాణి యుదకకలశముతో)

(వామనుని పాదములఁగడిగి తలపై జల్లుకొని నమస్కరించి)

బలి—భూసురోత్తమా!

మ. వడుగా యెవ్వరివాఁడ వెవ్వఁడవు సం • వాస స్థలం బెయ్యది
య్యెడకుఁగా నీవరుదెంచుటఁగా సఫలమ • య్యెఁగావంశమున్ జన్మముం
గడుధన్యాత్ముఁడనైతి నామఖము యో • గ్యంబయ్యె నాకోరికల్
గడతేరెన్ సుహృతంబులయ్యె శిఖులుం • గల్యాణమిక్కాలమున్.

వామ—దానవరాజశేఖరా! అర్థార్థినై నేను నీసన్నిధికరుదెంచితిని.

సీ. ఇది నాఁడు నెలవని • యేరీతిఁ బల్కుదు
నొకచోటనక యెందు • నుండనేర్తు

ఎవ్వానివాఁడనం • చేమని బల్కుదు
  న్యాయంతవాడనై • నడువనేర్తు
నీనడవడియని • యెట్లు వక్కాణింతు
  బూని ముప్పోకలఁ • బోవనేర్తు
నదినేర్తు నిదినేర్తు • ననియేల చెప్పంగ
  నేరుపులన్నియు • నేననేర్తు
నొరులుగారు నాకు • నొరులకు నేనౌదు
నొంటివాఁడ జుట్ట • ముకఁడులేడు
సిరియుఁ దొల్లి గలదు • చెప్పగ నాయింటి
సుజనులందు తరచు • సొచ్చియుండు.

ముల్లోకంబుల వన్నెకెక్కిన దాతవని పలువురచే నాలించి నావాంఛి
  తంబు నీవలన దీరునను తలంపుతో నిచ్చటికి కరుగదలంచితిని.

బలి—మహాభాగా! తమకోర్కె యెద్దియైన దీర్చుటకు సిద్ధముగా
  నుంటిని యానతింపు చేతులుగట్టుకొని చేసితీరెదను.

వామ—(ఆలోచించుచుండును అభినయము.)

బలి—విప్రపుంగవా! సందేహించుచుంటిరేల - ననత్యమాడువాఁడ
  నని తలంచుచుండిరా!

వామ—అట్టి తలంపులేదు. మున్ను చన్న మీవారందఱును మహాబల
  సంపన్నులు ఆడినమాట తప్పియెఱుంగరు. ఆవంశమర్యాదను
  నీవు చక్కగా నిలుపగల సమర్థుఁడవు.

బలి—మహాభాగా సంశయమేలేనిచోఁదమ వాంఛితంబును దెల్పుడు.
  దుకూలాభరణములో హయంబులో కరులో రత్నములో
  కాంచనమో సత్కులసంజాతలగు కన్యలో గ్రామములో
  భూములో గాక ధరణీఖండమె వాంఛించెదరో దెల్పుఁడు. ఇవ
  న్నియును గావలసినను గొనుడు.

వామ—బలీంద్రా ! నీ చెప్పిన వస్తువుల బ్రహ్మచారినగు నేనేమిచేసి కొనగలవాడను యీవస్తువులలో నా కేదియును వలదు.

శుక్రా—(తనలో) ఏమిది. యీతని చరిత్ర మద్భుతముగా నున్నదే. యీతనికోర్కె యెయ్యదిగా నోపును.

వామ—ఓబలిసార్వభౌమా ! నాపల్కు లాలించుము.

గీ. ఒంటివాఁడ నాకు • నొకటి రెండడుగుల
మేరయిమ్ము సొమ్ము • మేరయెల్ల
గోర్కెదీర బ్రహ్మ • కొకటి ముల్లైద
దానకుతుకసాంద్ర • దానవేంద్ర.

బలి—భూసురోత్తమా ! ఇదేటికోర్కె ! కోరఁ దగ్గదియైనయొసంగెద నని యొకటిరెండడుగుల నేలమాత్ర మడిగితివేల? ఇంతమాత్రముకన్న నధికముగా గోరిన నేనొసఁగలేనని దలఁచితివా ! లేక వేరొం డెద్దియైన వడుగవలయునని స్మరింపకేమఱచి యిట్లడిగితివా? లేక పరిహాసమునకై యడిగితివా? భూసురోత్తమా ! దాన మడుగునప్పుడు దాత కింపులనైన పలుక వలదా !

మ. వసుధాఖండమువేడితో గజములన్ • వాంఛించితో హాజులన్
వెసనూహించితొ కోరితో యువతులన్ • వీక్షించి కాంక్షించితో
పసిబాలుండవు నేర వీవడుగ నీ • యల్పంబు నీపాటికా
కసురేంద్రుండు పదత్రయం బడుగ నీ • యల్పంబు నీచేర్పునే.

వామ—బలీంద్రా ! నీ చెప్పినవాటితో నా కేటినిమిత్తము.

మ. గొడుగో జన్నిదమో కమండలువొ నా • కున్ ముంజియో దండమో
వడుగే నెక్కడ భూములెక్కడ కిరుల్ • వామాక్షులశ్వంబు లె
క్కడ నిత్యోచిత కర్మమెక్కడ మదా • కాంక్షామితం బైన మూ
డడుగుల్ మేరయ త్రోవకిచ్చుటది బ్ర • హ్మాండంబు నాపాలికిన్.

ఈతని వచనంబులఁబట్టి చూడ నీతఁడు భూసురమాత్రుఁడని దోపదు. దేవతలకార్యంబు సాధించుకొఱకున్నై శ్రీమహావిష్ణు వీరూపంబున నదితిగర్భమున కశ్యపసూనుఁడై జన్మించియిచ్చోటి కరుదెంచెను. విష్ణు వాంఛించినాఁడు నీవెఱుంగక యిచ్చెదనని బల్కిన మూడడుగులమేరకు స్వర్గమర్త్యపాతాళము లాక్రమింపగలఁడు.

కం- ఒక్కపదంబున భూమియు
నొక్కట త్రిదివంబుఁ దొక్కి • యున్నతమూర్తిన్
దిక్కులు గగనేమునిండై
వెక్కసమైయున్న నెఱుఁగు • వెసఁ జెప్పుమా !

ఇంతియెగాక నాపల్కులాలింపుము ఈదానమొసంగినందువలన సర్వంబును నాశనముగాగలదు. గావున నీదానమువలన సర్వంబునకును నాశనముగలుగుచునో యట్టిదాన మొసంగకుండుటయె యుత్తమము అట్లొసంగకుండుటవలన నీకు నింతయు దోసము లేదు. ఇదొక్క ధర్మసూక్ష్మమున్న దాలింపుము. తనకుఁగల సర్వస్వమును నైదుభాగములుగ విభజించి యందొక్క భాగమును దానధర్మంబులకు వినియోగింపవలయును. సర్వస్వంబును విష్ణునకు సంతర్పణ మొనరించి బిచ్చగాఁడవై యెట్లు జీవింపగలవు కావున నీవీదాన మొసంగననుము అయ్యో ! అన్యథామెట్లు డువాడనందువేమో యాలింపుము-

ఆ. వె. వారిజాక్షులందు • వైవాహికములందు
ప్రాణవిత్తమాన • భంగమందు
చకితగోకులాగ్రి • జన్మరక్షణమందు
బొంకవచ్చునఘము • వొందదధిప-

ఈదానమువలన ప్రాణవిత్తమానములు మూడింటికిని భంగముగ్గలుగు

శా. ఆదిన్ శ్రీసతి కొప్పుపైఁ దనువుపై ♦ నంశోత్తరీయంబుపైఁ
పాదాబ్జంబులపైఁ గపోలతటిపైఁ ♦ బాలిండ్లపై నూత్నమ
ర్యాదం జెందుకరంబు గ్రిందగుట మీఁ ♦ దై నాకరంబుంట మే
ల్గాదే రాజ్యము గీజ్యమున్ సతతమే ♦ కాయంబు నాపాయమే.

మ. నిరయంబైన నిబంధమైన ధరణీ ♦ నిర్మూలనంబైన దు
ర్మరణంబైన కులాంతమైన నిజమున్ ♦ రానిమ్ము కానిమ్ము పో
హరుఁడై నన్ వారిజాక్షుఁడైన నీరజభవుం ♦ డభ్యాగతుండైన నా
దిరుగన్ నేరదు నాదు జిహ్వ వినుమా ♦ ధీవర్య వేయేటికిన్.

గురువర్యా ! నన్ను క్షమింపుము తమపల్కులకెదురాడితినని నాపైఁ గినియకుడు. ఆ వెన్నుఁడు మాత్రము నన్నేల వంచించును. అతఁడు గోరిన యర్థంబొసంగుచుండ నన్ను వంచించునా? అట్లు వంచించి నచో నయ్యది నాభాగ్యము గాకుండునే యేదియెట్లయినను దానంబు నొసంగెదను.

వామ—బలీంద్రా ! ఏమందువు.

శుక్రా—ఏమిది? నాపల్కుల నాదరింపకుంటివి. నావచనంబులకుఁ బ్రతివచనమిచ్చెదవా ! కులగురుఁడనైన నా శ్రేయంబనవరతంబు గోరెడి నన్నే తిరస్కరించెదవా ! మూర్ఖా ! ఇందులకుఁ దగిన ప్రతిఫలంబనుభవింపుము. నావచనంబు లాదరింపక నన్నవమానపరచితివి గావున శీఘ్రకాలంబునఁ బదభ్రష్టుండవు గమ్ము. (నిష్క్రమించును)

బలి—గురువర్యా !

ఆ. బ్రతుకవచ్చుఁగాక ♦ బహుబంధనములైన
వచ్చుఁగాక లేమి ♦ వచ్చుఁగాక
జీవధనములైన ♦ చెడుగాక పడుగాక
మాటదిరుగ లేరు ♦ మానధనులు.

తమశాపంబునకు గుఱియైనాసుల కెంతగా విచారించుచుంటినో యం
తకు వేయిరెట్లు పరితాపమున సత్యమతిక్రమింపజాలనని జెప్పు
చున్నాడను (వామనుని వైపునకు దిరిగి) వటూత్తంసమా!
జాలమికేల? రమ్ము! నీపాదపంకేరుహంబులఁ గడుగనిమ్ము.

క. రమ్మా మాణవకోత్తమ
లెమ్మా నీవాంఛితంబు • లేదనకిత్తున్
దెమ్మా నీయడుగుల ని...
నిమ్మా కడుఁగంగవలయు • నేటికి? తడయన్.

(పాదముల గడుగు టభినయము)

వామ:—బలిసార్వభౌమా! ధారాపూర్వకముగ మూడడుగుల మేర
ధారవోయుము.

బలి—పంచభూతంబులు-సోమసూర్యాది గ్రహనవకంబును-పరమేశ్వ
రుడును- సాక్షులుగ నీవటుశిఖామణికి మూడడుగుల మేర
దానమొసంగితిని. (ధారవిడువబోవ పడకుండును)

వామ (తనలో) శుక్రుడు ధారపడకుండ జేయుచున్నాడుకానిమ్ము
(ప్రకాశముగ, రాజేంద్రా! ధారపడుట లేదు. యించుకతాళు
ము. ఆర్గానిని నేన ఒక్కనేసెద. (అని దర్భపుడకచే బొడు
చును)

శుక్రుడు—(ప్రవేశించి గోదనము చేయుచు 'బలీ! కంటివా' నీచేసెడి
నదానమిరాయకుండ నేనుచోరి నీటిధారపడకుండ నిలుపుజేసి
నందులకు నానేత్రమునకు మోసమువాటిల్లెను. చూచితివా!
యీతనిపనులు యిప్పటికైన నామాటవినుము.

బలి—గురువరేణ్యా! నాజిహ్వ తిరుగనేరదు.

శుక్ర—అయిన నాశాపమనుభవింపుము.

(శుక్రుడు నిష్క్రమించును)

(బలి దాన మొసంగును. వామనుఁడు విశ్వరూపియగును.)

బలి—(ఆశ్చర్యముతో) వింతగానున్నదే? ఈరోదసీకుహరమంతయు నాక్రమించి దివ్యతేజంబుతోనున్న యిమ్మహాభాగుండు-యా చార్యుఁడు నుడివినట్లా నారాయణుఁడే గావలయును.

వామ—బలీంద్రా! ధారాపూర్వకంబుగ దానమొసంగిన మూడడుగులకు భూమ్యాకాశములు రెండుపదంబులయ్యెను. మూడవ పదమునకు తావుజూపుము లేకున్న యనృతమాడిన పాపమున బోవగలవు.

బలి—నారాయణస్వరూపా!

ఆ, వె. సూనృతంబుగాని • నుడియదునాజిహ్వ
బొంకజాలనాకు • బొంకులేదు
నీతృతీయపదము • నిజమునాశిరమున
నెలవుసేసిపెట్టు • నిర్మలాత్మ.

ఆ. వె. నిరయమునకు బ్రాప్తి • నిగ్రహమువకును
పదవిహీనతకును • బంధనమున
కర్థభంగమునకు • నఖలదుఃఖమునకు
వెఱవ వడే బొంక • వెఱచినట్లు.

వామ—(పాదమును బలిశిరముపైనిడి) బలీంద్రా! నీభక్తికి-నీసత్యవాక్పాలనంబునకును- నీదాతృత్వమునకును చాల సంతసించితిని. సావర్ణమన్వంతరంబున నీవింద్రుఁడవు గాఁగలవు. అంతపర్యంత మీవు నాపదధ్యానతత్పరుఁడవై సుతలలోకంబున సుఖముండుము.

బలి—(నమస్కరించి) అనుగ్రహింపబడితిని.

ఉ. ఎన్నఁడు లోకపాలకుల • నీకృపఁజూడని నీవునేఁడు న
న్నున్నతిసేసి నాబ్రతుకు • నోజయునానతియిచ్చిగాచితీ
మన్ననలీదయారసము • మాటల పెద్దరికంబు జాలవే
పన్నగతల్ప నిన్నెఱిఁగి • పట్టిన నాపదఁగల్గనేర్చునే?

భవత్పదారవింద సేవాతత్పరుఁడనై మెలఁగునట్లనుగ్రహించితివి. యిం
తియొజాలును. భవదాజ్ఞపై సుతలంబుననే యుండెదను.

( తెరపడును )





శ్రీ

# సంగీతవిష్ణులీలలు



## పరశురామావతారము.



(ప్రవేశము:—కార్తవీర్యార్జునుడు, వీరసేనుడు)

కార్త—వీరసేనా! ఒక్కసమయమున ననేకాక్షోహిణులకు నెవరికి యెట్లు యెట్టిసౌఖ్యములు గావలయునో యట్టిసౌఖ్యములొసంగూర్చి విందొనర్చినాడు. ఈజమదగ్ని మహాముని ప్రభావము వర్ణించుట కలవిలేనిదిగదా.

వీర—ప్రభూత్తమా! అయ్యది యామునిప్రభావమని నేను వినగను అతనిచెంతనున్న సురభియను కామధేనువే సమస్తమును సమకూర్చెను.

కార్త—అట్టిసురభిమాత్రము సామాన్యులకు లభించునా? తపఃప్రభావము గలవారికిగాని యట్టికామధేనువు లభింపదు.

వీర—అట్టి ధేనువు తపోబోట్లకడ నుండదగునుగాని యాకులములం దినుచుం గాలంబుంగడపు మౌనిజనులకేల?

కార్త—నిజము! నిజము! కాని యదిమనకెట్లు లభించును.

వీర—ఆజమదగ్ని మహామునికడకు నన్నుంబంపుడు. యాతని ప్రార్థించి యాధేనువును గొనివచ్చెదను.

కార్త—బహుయత్నలభ్యమైన యాధేనువును నీవడుగుటయే తడవుగా నీకొసఁగునని తలంచితివా !

వీర—విప్రులు ధనాశాపరులు గావున స్వర్ణమహాత్మ్యమున వారల లోబరచుకొనవచ్చును

కార్త—అరణ్యంబుల కందమూలాదికముల భక్షించుచు తపోనిరతులై యుండువారలకు ధనాశయుండునా?

వీర—దేవా పలుమాటలేల? వయిరెండు మార్గములు సరిపడకున్న దండింపైన యాసురభిని దోఁచుకొని వచ్చెదె సంశయింపక నన్ను బంపుడు.

కార్త—అట్లయిన పోయి రమ్ము

వీరసేనుడు — చిత్తము (నిష్క్రమించును)

కార్త—అట్టిధేనువు నవశ్యముగా సాధింపవలయును. దండించియైన భూపాలకుఁడు తన దేశంబునగల జనులయొద్దనున్న సువస్తువులఁ గైకొనవచ్చును. 'దండించి యాధేనువునుఁ గైకొంటిమని పరశురాముఁడు యుద్ధమునకు సిద్ధపడునని దలంచెదను ఆయిన నాకేటిభీతి. ముల్లోకంబుల గడగడలాడింపగల మేటిమగండనైన నన్నెదిరించి యాపేదపాఱుఁడు నిల్వనేర్చునా? మొన్న మొన్న దేవేంద్రాదుల నిర్జించి వారలచే సమస్తోపచారములు చేయించుకొనుచున్న యారావణునంతవానినే పట్టి బంధించి యుంచితినిగదా ! ఇంక నీపరశురాముడా నను నెదుర్కొనజాలులు. ఈతఁ డొక్కఁడేగాదు. యీతనివంటి పేదపాఱులు పదివేవురు ప్రతిఘటించి నిలచిన నించుకేనియు భీతిల్లను. వారల నెల్ల జిక్కాడి యాసురభిని గైకొందును.

(ప్రవేశము—వీరసేనుఁడు.)

వీర—మహారాజా ! జయము. జయము.

కా—ధేనువును గొనివచ్చితివా? యాజమదగ్ని యద్దానిని నమునిటు
మే తనవుగా నర్పించెనా?

వీర—లేదు. లేదు. ఎన్నివిధముల బ్రతిమాలితిని కాని లాభము
సుమంతయును గాన్పింపలేదు అంత నేనింక చేయునది లేక
బలిమి నద్దానిని గొనివచ్చితిని

(తెరలో) హైహయాధీశ్వరా ! రక్షింపుము-రక్షింపుము- ప్రమత్తుల
మై యుద్ధమునకు సిద్ధముగాలేని మమ్ముల నీపరశురాముండద
రించి వధించుచున్నాఁడు.

వీర—(తనలో) కార్యము మించివచ్చినది పరశురాముని కోపమింత
వంతట చల్లారదు.

కా—సైనికులారా ! వెలువడుఁడు మీమీ బలంబులఁజూపి యాతని
నెటులైన నిర్జింపుఁడు సేనానాయకులారా !

ఉ. బాలుఁడు వెఱ్ఱి బ్రాహ్మణుఁడు • బ్రాహ్మణుకై వడినుంటమానిధా
పాలురతోడ భూరిజయ • భవ్యులతోడ భయంబునక్కఁ గ
య్యాలకువచ్చినాడు మన • యాదికిఁ బాపములేదు లెండు లెం
డేలసహింపభూసురుని • నేయుడు వ్రేయుఁడు గూల్చుఁడిమ్మహిన్.

మంత్రిసత్తమా ! కార్యము మించివచ్చినది. రమ్ము సంగ్రామరంగ
మునకేగి- నేసలబురికొల్పిపత్తము రమ్ము. (నిష్క్రమింతురు)

ద్వితీయరంగము

పరశురాముఁడు కార్తవీర్యుఁడు

పర—ఓరోరీ ! క్షత్రియకులాధమా ! పరమనిష్ఠాగరిష్ఠుఁడై తపమాచ
రించుచు గాలయాపన మొనరించుచున్న విప్రులధనంబు లప
హరింప నెంచితే. దుర్మతీ రమ్ము-నిమ్మ భీమసంగ్రామంబున
కథావశేషునిగా నొనర్చి నీతోడివారలకు బుద్ధిసెప్పెద.

కా—వెఱ్ఱిబ్రాహ్మణుఁడా! యూరక యేల వదరెదవు. కిరణముల ప్రతిఘటించి నిలచి నన్ను నిర్జింపజాలువాఁడు లేఁడు.

పర—ఏమా! గర్వము-కావచాపబలంబులుగల్గిన భూసురులే నిన్ను సమయింపగలరు. దుర్మతీ! యింతగర్వాంబుగల నిన్నూరక విడువరాదు.

కా—మేటిబలుఁడగు-త్రిలోకభువనంబుల నుత్తలబడజేసిన-వీరాగ్రణిడగు పంక్తికంధరుని యవస్థ నేమయ్యెనో వింటివా! పెక్కు-వత్సరంబులు నా చెరసాలలో నివసించెను. అతనిశక్తియుక్తుల కన్న నధికంబగు శక్తియుక్తులున్న రమ్ము.

గీ. లోకములు మూడుఁగూడ క • ల్లోలమొంద
జేయుపంక్తికంధరుని శి • క్షించినట్టి
జెట్టి నగునన్ను మార్కొను • చేవయున్న
దురమునను నిల్చి జూపుమీ • తోర్బలంబు.

పర—ఛీ! దుర్మతీ! యుద్ధమునకు సిద్ధపడియుండుము. నేఁడు నిన్ను పరేతరాజనిలయంబున కంపినగాని రణరంగమును విడువ నొల్లను.

కా—పాఱుడా! వృథా వదరెద వేల? బ్రాహ్మణుల కుద్భవించియు-క్షత్రియోచితములగు వీరాలాపములనీవాడుట జూడ గడుంగడు వింతగానున్నది.

పర—ఓరీ! వృషకీటకాధమా! పూజనీయుల మగు మమ్ము దూలనాడ సాహసించితివా! జన్మముచే బ్రాహ్మణుడనై కావబలంబును ఈశ్వరవరప్రసాదమున క్షాత్రబలంబును బొందియున్నాను. యింకనైనను- నా క్షత్రియోచిత వీరాలాపములకుగల కారణ మెఱుకలేదటునా!

శా—(చిఱునవ్వున)దత్తాత్రేయ వరప్రసాదలబ్ధమైన యీకార్తవీర్య
నిమోళిల నీశాపచాపబలంబులు- పనిజేయజాలవు.
పర...(కోపమున)కేదుర్మతీ ! (18)
శా— వెరిప్రాఠ్ఠా ! నీబెదరింపులకు భీతినొందువారెవ్వరు నిచ్చటలేరు
యుద్ధమునకు సిద్ధపడి-రమ్ము నీశాపచాపబలంబుల మంట
గలెపెద.
పర— ఓరీ ! నృపకులాధమా ! ఇంక కడతేరితివి'
(యుద్ధమొనరించెదరు పరశురాముడు కార్తవీర్యుని బాహువులన్నిటిని
ఖండించి శిరస్సును నేలగూల్చును.)
పర— దుర్నీతిపరుండగు నీతడు కడతేరెను. అవృత్తాంతము జనకునకె
ఱిగించి యాతనినిగూడ సంతసమునగూర్తును.
(నిష్క్రమించును)

తృతీయరంగము-పర్ణశాల.

జమదగ్నియు-పరశురాముడును యుండగా తెరలేచును.]
జమ— కుమారా ! ఎంతకౄరకర్మ మొనరించితివి. వర్ణాశ్రమకులా
చారధర్మంబులు దప్పివర్తింపకుండ శాసించి భూవలయంబును
బరిపాలించుచు-విపినాంతరాళంబుల పవనపర్ణాంబుభక్షులై వసిం
చుచున్న-మనబోంట్లకేకీడును బొరయకుండ రక్షించుచు సౌఖ్య
మొనగూర్చుభూపాలుర వధించుటయే తగునని భావించితివా?
కం॥ కలవేల్పు లెల్లదమతమ
చెలువంబులు దెచ్చి రాజు • జేయుదు రకటా

బలుపేల్పురాజు వానిం
జలమున నిల్లిలపోయి • జంపితివృరాా !

పర—జనకా ! క్షమింపుము. మనమరభిని బలిమినిగొనిపోయెనని రేణు
కానునికుమారుఁడు దెల్పినంత సణచుకొనలేనంతటి క్రోధము
నన్నావేశించి యాతని వధింపజేసినది.

జమ—కుమారా ! క్రోధమే సర్వనాశనమునకు మూలకారణము-
క్రోధముగల మానవుడెప్పటికిని స్థిరకీర్తి నార్జింపజాలడు. ఓర్పు
గలిగి యుండుటవలన సర్వకార్యముల సాధింపవచ్చును. మన
బోంట్లకు శాంతియే ధర్మము

కం॥ శాంతి మనకును ధర్మము
శాంతిమూలంబు మనకు • ధన్యత్వమునం
దాంతిగలదని యీశుం
జేలించును బ్రహ్మపదము • నెల్లన్ మనలన్.

ఇంతియేగాక పద్మాసనంబున గూర్చుండి నిష్ఠాగరిష్ఠుండై తపమాచరిం
చినంత మాత్రమున నే మానవుఁడు పుణ్యలోకమునకుఁ బోవ
జాలఁడు. అరిషడ్వర్గంబుల జిక్కువడక సర్వభూతంబుల సమ
దృష్టి నరయుచు తనకెవ్వడేని యెగ్గొనర్చినను నోర్చికొనియుం
డి సన్మార్గంబున నడచునో యాతఁడు పుణ్యలోకమును జేర
గల్గును.

కం॥ క్షమ గలిగిన సిరిగలుగును
క్షమగలిగిన వాణిగలుగు • సారప్రభయున్
క్షమగలుగుతోన గలుగును
క్షమగలిగిన మెచ్చుశౌరి • సదయుఁడుతండ్రీ.

క్షమగలిగినవానికి సిరిసంపదలు గలుగును క్షమగలిగివాఁడే జగదీ
శ్వరుని మెప్పొందఁదగువాఁడు క్షమారహితుఁడవై నీశపకార

మొనర్చి వాఁడని పట్టవు రాజును వధించితివి. సర్వశాస్త్రపారంగతుఁడగు విప్రపుంగవుని వధించుటయే మహాపాతకము బ్రాహ్మణుని జంపిన ఘోరపాపంబుకంటెను భూనాయకుని జంపిన పాపమధికము గాన కార్తవీర్యార్జునని జంపిన పాపపరిహారార్థమై తీర్థయాత్రకు వెడలిరమ్ము.

క. పట్టవురాజును జంపుట
కట్టలుకన్ విప్రుజంపు • కంటెను బాపం
బట్టిట్టనకను నీవీ
చెట్టుసెడక తీర్థసేవ • సేయుము తనయా !

పర—(జనకుని యెదుట మోకరించి) జనకా ! క్రోధరసాయత్త చిత్తుడనై యుక్తాయుక్తము లరయనేరక— "నాకి ష్ణుః పృథివీపతిః" అను వాక్యమును దలఁపఁబోవక-స్వయంకృతాపరాధంబున-నేసంపాదించుకొనిన యీమహాపాతకంబునకుఁ దగిన ప్రాయశ్చిత్తము విధించిరి యీమహాపాతకము నిఃశేష మాత్రమున పటాచంచలై పరువెత్తునట్లొనర్పగల-చక్కని మార్గమొక్కటి యుపదేశించి- యనుగ్రహించిరి. మహాదురిత పంకమధ్యంబున జిక్కుకొని యిటునటు గదలమెదల జాలని స్థితిలో నున్న నాకు- యిట్టితరుణోపాయ ముపదేశించి నన్ననుగ్రహించినందులకివే నాశతసహస్ర వందనములు- ఇంక నాకనుజ్ఞ యిండు యొక్క వత్సరములో పుణ్యనదీనదంబుల స్నానమాడి- పాప కళంకరహితుఁడనై-తమదర్శనమునకరుదెంచెద. ఆశీర్వదించి పంపుడు-పోయివచ్చెద.

జమ—కుమారా ! పోయిరమ్ము. నేనును యనుష్ఠాన మాచరించఁబోయెద. (యిరువురును నిష్క్రమింప తెరవ్రాలును)

## చతుర్థరంగము.

(మృతుఁడైన జమదగ్ని మహామునిపై బడియేడ్చుచు - రేణుక ప్రవేశించియుండగా తెఱలేచును.)

రేణు—నాథా! పలుకరేమి? తమపాద రాజీవములేగతియని నెమ్మది సర్వకాల సర్వావస్థల సంస్మరించుచు - తమతోడిదే లోకమనుకొని - యింకను - పదపద్మసేవ లొనర్పవలయునని యుత్సహించుచున్న నన్నిట్లనాథగతి పాలొనర్చి దివికేగితిరా! ఇంకమనము ద్దుష్కర్మిలకు దిక్కెవ్వరు? - మన చిన్నికుమారుఁడగు పరశురాము నెవ్వరి కప్పగించితిరి - అయ్యో! కడుపుదహించుకొని పోవున్నదే... అల్లనాఁడా దురాత్ముండగు హైహయాధీశ్వరుఁడ కొసఁగిన యాతిథ్యఫల మీవిధముగా మనలఁజుట్టుకొనినదా! పరశురామా! హా పరశురామా! నీవేయున్నయెట్టి యాపద తటస్థించి యుండదుగదా! నీవు కార్తవీర్యుని జంపితివని క్రోధమున నీవూరలేని తరియా హైహయులెల్ల గుమిగూడి యిచ్చటికరుదెంచి - తపోనిష్టాగరిష్ఠుఁడైయున్న నీజనకుని వధించినారు. పరశురామా! నాఁడు కార్తవీర్యుని జంపుటగాను నేఁడు నాకిట్టి దుఃఖమొనగూర్చిన వారిని జక్కాడి - సంతసమొనగూర్పుము... అయ్యో! పరశురాముఁడేడీ!. ఏడీ (మూర్ఛిల్లును)

(ప్రవేశము: — పరశురాముఁడు)

—(అనుబంధము) నేఁడేలనోగాని పెక్కుదుర్నిమిత్తములు దోఁచుచున్నవి. ఎట్టివార్త వినవలసివచ్చునోగదా! (ముందుకునడచి రక్తమునుజూచి) ఇదేమి - ఈరక్తప్రవాహమేమి? (పరికించి) జనకా! (మూర్ఛిల్లును)

రేణు—(మూర్ఛదేరి పరశురాముని గాంచి) తనయా! పరశురామా! వచ్చితివా. (మూర్ఛిల్లును)

పర—(మూర్ఛదేరి) అమ్మా!

రేణుక—కుమారా! గంటివా! నీజనకుని యవస్థ నీజనకుని హితులైన హైహయులొనర్చిన యుపకారము. తమతండ్రిని సమరంబున మ్రందించినందులకు నీజనకుని వారు తెగమట్టించిరి హైకేళివక్కాణించుచు నా యెదుటనే యిట్టి యకృత్యము నర్చిరి

పర—(తీగుర్తిగ్లై మండిపడుచు) ఏమేమీ! యర్జుననిపుత్రులా! యిట్టి యకృత్యము నర్చినది కానిమ్ము వారలనెల్ల యీదినంబుననే మట్టుపెట్టెదను ఓరీ! దురాత్ములారా! మీకు మరణమాసన్నమైనదని తెలిసికొనుడు. ఒక్క యీదురాత్ములనేగాక. నృపాలుర లేకుండునట్లెల్లర వధించి తీరెదను. మద్యమాంసంబుల కుత్తుగబంటిగా మెసవి భోగపరాయణులై దాము దినుచున్నదెల్ల ప్రజలకష్టార్జితమను మాటమరచి యుక్తాయుక్తములు విచారింపని భూపాలురుండిననేమి? లేకున్ననేమి? ఓరీ! రాజాధములారా! భూమిపై నొక్క మగవుడైన లేకుండునట్లొనరించి నా జనకుడు స్వర్గమునకేగకట కనపగు సోపానములుగా మీశవముల బరచియుంచెదను. అమ్మా యూరడిల్లుము.

గీ. మాటవరుసకు నొకరాజ • మాతృదేవి
మిగులకుండగనెల్లర • మృత్యువాత
ద్రోసి నాజనకునకు సం • తోషమెసగ
తర్పణముశేతువారి ర • క్తంబుతోడ.

జననీ నాకనుజ్ఞయిమ్ము,

రేణు—కుమారా! నీజనకుడు నన్ను విడచినందులకే చింతించుచున్న నన్ను విడచిపోయెదవా!

పర—అమ్మా ! భూపాలుర: జక్కాడకున్న నాదుఃఖానలము జల్లా రదు

రేణు—కుమారా ! పోయిరమ్ము

పర—మహాప్రసాదము. (నిష్క్రమించుచుండ తెరవాల్లును)

పరశురామావతారము

పంచమరంగము.

[ప్రవేశము:-పరశురాముఁడు.]

పర—మున్ను నాజననితోఁ జేసిన ప్రతిజ్ఞాప్రకార మిర్వదొక్కమారు లీ ధరావలయంబునఁగల భూపాలురవధించితిని. భూభారముడిపితిని. ఇంకని చ్చోటనే నొనరింపవలసిన కార్యములన్నియు ముగిసినవి. ఇంక నాజనకునకుఁ బుణ్యలోకములు బ్రాప్తించుట కొఱకయాగ మొనరించి నా బాహువిక్రమంబున నార్జించిన యీరాజ్యం బొక్కవిప్రునకొసంగి జనసంపర్క మిసుమంతయు లేని మహేంద్రపర్వతమ్మునఁ దపం బొనరించుకొనియెద.

[నిష్క్రమించును. తెరవాల్లును]





శ్రీ

# సంగీత విష్ణు లీలలు



## రామావతారము.



### పర్ణశాల.

[సీతారామలక్ష్మణులు ప్రవేశించియుండగాఁ దెఱలేచును.]

రాము—అన్నా లక్ష్మణా !

చ. జనకునియాజ్ఞ మౌళినిడి ♦ స్వాంతమునన్ బెగడొందకుండ యీ
వనములఁజేరి రక్కసుల ♦ బల్విరజాపి జయంబుగాంచి స
న్మునివరులిచ్చు దీవనలు ♦ మోదముతో గొనినట్టి హర్షమే
మనముననుండదయ్యో గుణ ♦ మాన్యుఁడు తండ్రి దివంబుఁజేరుటన్.

ఇంతలోననే యింతయగునని యెన్నడైన సమకొంటిమా !

సీ. పదునాల్గువర్షముల్ ♦ పదునాల్గునిమిషంబు
లట్లు కాలక్షేప ♦ మమర జేసి
తనకోర్కెలీడేర ♦ ననిమదిలోనకై
కమ్మమిగులసంత ♦ సమ్ము నొంద
నిత్యసత్యవ్రత ♦ నియతాత్ముడౌ తండ్రి
ఘనతరామోదంబు ♦ గనుచునుండ
ప్రజలెల్లమారామ ♦ భద్రుడేం తెంచెమా
భాగ్యమేమనిజూడ ♦ వచ్చుచుండ

గురువరేణ్యుకు సమ్మతి • వరులతోడ
వడిగ జనుదెంచితీవన • లిడుచునుండ
నాపురంబును జొరనున్న • నాదు కోర్కె.
హరిస్వరూపమై పోయెబ్రతుకెందు • కక్కటకట

సీత—నాథా! మామగారదృష్టవంతులు. అరువదివేలవత్సరము లఖండవైభవంబుతో భూమండలంబెల్ల బరిపాలించి గణింపరాని యశోలక్ష్మి నార్జించి విష్ణ్వంశసంభూతులగు మిమ్ము పుత్రులుగా బడసి నేటికి విధిప్రేరణముచే దివ మలంకరించిరి. అట్టివారి మరణమునుగూర్చి మనము సంతసింపవలయును. కాని కలిగిన సంతానములో నొక్కడైన కడదినంబున దగ్గర లేకునికిమాత్రమే గాఢవిషాదమున కెడమిచ్చుచున్నది.

రాము—కల్యాణీ! నీవనినది నిక్కువము కన్నతండ్రిని పిడికెడు బుగ్గి సేయు నదృష్టము దురదృష్టవంతులమగు నాకు లేకున్నమానె యాకాలమునకు భరతశత్రుఘ్ను లిరువురుకూడ లేక పోవలయునా?

లక్ష్మ.. అగ్రజా! గతించినదానికై వగచుచు గూర్చుండిన మనకు మిగుల బ్రమాదము రాగలదని శంకించుచున్నాను. కారణమేమందురా! అదుగో యాచాయకు దిలకింపుడు. ఆవచ్చెడి జవ్వని యెవ్వతెయైయుండనోపును. ఇదిమహారణ్యముగదా! మానికాంత లీతీరున శృంగారదేవతలవోలె నుండరుగదా! అట్టి నవనవాంగకోమలు లీప్రాంతమున కిట్లొంటరిగ రాజాలరుగదా! అట్టియెడ నీతరుణీమణి మనమున నెట్టి భయమును లేక-యాత్మరక్షణమునకొరక యాయుధమైనను లేక- యెట్లిచ్చటికి రాగలిగి యుండును. ఇదేదియో రాక్షసమాయగా నుండ నోపునని నాతలంపు.

(ప్రవేశము: శూర్పణఖ)

శూ—[తనలో] మునులు చెప్పిన రామలక్ష్మణులు వీరై యుందురు. నా కుమారుని దనుపట్టపెట్టుకొన మునిముచ్చులవోలె కూర్చుండిరి. ఈక్షణమున వీరలకై బడి వచ్చినక్క "కటక్క" నకొలికి నట్లే యిరువురను గొలికి నాదుఃఖానలమును జల్లార్చుకొనియెదను. [సమీపించి పరికించిచూచి] ఎంతసుందరాకారులు-వీర ల జక్కాడుటకుమారుగా-పెక్క మద్దులిడుకొనవలయునను మోహము మాదయించుచున్నది. వీరిలో నొక్కని జేరదీసితినా-నాజన్మసార్థకమగును [యింకను సమీపించి] .సుకుమారులారా ! మీరెవ్వరు

లక్ష్మ—జవ్వనీ! తండ్రియానతిచే నరణ్యావాసమొనరింపవచ్చిన శ్రీరామచంద్రుడతడు నేనాతనితోగూడ నరుదెంచి యాతనికి వలయు పరిచర్య సేయుచుందును నన్ను లక్ష్మణుడందురు. నీవెవ్వతెవు. ఇట్లొంటరిగ నిమ్మహారణ్యంబున నేలదిమ్మరుచుంటివి.

శూర్ప...(రామునితో) మారసుకుమారసుందరా ! లోకపాలకుల మని మేటి బిరుదములగన్న యింద్రాదుల బెక్కుమార్లు రణరంగమందు జితోస్మియనిపించిన లంకాధినాథుడగు రావణుని సోదరిని ఇంకనావచ్చినపని వినుము మునులవలనే నీవు సుందరుడవనివిని నాజన్మము సార్థకపరచుకొనవలయునని యిట్లరుదెంచితిని నన్ను జేబట్టి యాదరింపుము.

తే- వలచివరియించుకొన్న దం • పతులసౌఖ్య
మంతు దరిలేనివాకాసి • యట్టులుండు
రసికవరున్న కేళ్ళాసి పే• యసిలభింప
వెరుగు వద్దునుగలిపిన • విధముదవరు

సీతతో సహవాసము సేయుచున్న రెండువివిధమున నున్నదిగాపున నన్ను జేకొనుము. సతియుండగా నీవేలనందువేమో వినుము, యీమెవలన బాధలేకుండ మ్రింగివేసెదను

సీత—నాథా! యీదుర్మతి సిగ్గుబిడియములవిడచి రాక్షసకృత్యములకు వన్నెబెట్టునట్లుగా మాట్లాడుచున్నది.

రాము—సుందరీ! నీవంతశ్రమపడనేల? నామాట యాలించుము. ప్రస్తుతము మా మగువలు చెంత లేకునికి గష్టించుచున్న నా తమ్ముఁడగు లక్ష్మణునివరింపుము.

శూ—ఛీ! ఛీ! ఏమంటివి! నిన్న మనసారవలచి ప్రేమించినకాంతను తృప్తిపరుపలేక పరులయొద్దకు బొమ్మనుచుంటివా! యిది యేనా! నీమగతనము. ఇట్టివాఁడవగు నీతో నాకేమిపని. (లక్ష్మణునితో) లక్ష్మణా! నీవంగీకరింతువనుకొనుము. (సమీపించును)

లక్ష్మ—(దూరముననేగి) తాళు. తాళు.

గీ. పెద్దవాఁడగురాముని • విడచి వారి
దాసు వరియించి దాసివై • దనరఁగలవె
యతనినేగోరి వరియించి • నట్టులైన
వారితో బాటు నీకు స • పర్యజేతు.

ఈయుపాయము నీమది నాలోచించుకొనుము.

శూ—కొలమాలిన యొక్కమగపురుషునకై దాసిని కాజాలను. రామా! పెక్కుమాటలేల నన్ను పరిగ్రహింతువా! పరిత్యజింతువా!

రాము—(అపవారించి) సోదరా! యీమెకు బుద్ధిసెప్పుము (ప్రకాశముగ) శూర్పణఖా! నాసోదరుడే నీకు సుఖకరమగుమార్గము నుపదేశించును.

శూ—ఆదేనాకుఁ గావలసినది రమ్మా మార్గముపదేశింపుము.

(శూర్పణఖ లక్ష్మణుఁడు నిష్క్రమింతురు.)

[పునఃప్రవేశము.—లక్ష్మణుఁడు)

లక్ష్మ—అగ్రజా! ఈదురాత్మురాలి ముక్కుచెవులు గోసి వికృతాకారిణిఁ జేసివచ్చితిని.

రాము—విరుద్ధపు గోర్కెల గోరు వారల కయ్యది తగినశిక్షయే...

(తెరలోకలకలము) ఏమీకలకలము (ముందునటఁజూచి) పెక్కురు రాక్షసు లరుదెంచుచున్నారు. వారివెంట శూర్పణఖ గూడనున్నట్లున్నదే (జూచి) అగునగును. ఏరీల నామెపరాభవ మాలించి మనల బరిమార్చుటకై వచ్చుచున్న [illegible] ణా ఆబాలశాసనము [illegible] నేపోయి వారలరూపుమాపి వచ్చెద మీరువదినెను జాగరూకతతోఁ గనరయుచుండుఁడు.

(కార్ముకమందుకొని నిష్క్రమించి రెండవప్రక్కనుండి ప్రవేశించును)

సీత—(ఎదురేగి) నాథా! రాక్షసులెల్లఁ గథావశేషులైరిగదా!

రాము—కొందఱు మాత్రము భీతిల్లి పఱపులిడిరి. పెక్కురక్కసులీభూదేవికి బలియైరి. నాయకులగు ఖరదూషణు లిరువురును మడిసిరి.

(తెరలో)

శూ—ఖరదూషణాదులు సులభముగ నీచే పడిరని సంతసింపకుము. నాసోదరుఁడగు రావణునితోఁ జెప్పి మీకు దగినంత పరాభవ మొనర్పక నిద్రింపను. యాహారముఁ గొనను.

లక్ష్మ—ఓసీ! పోవే నీబెదరింపులకు భీతిల్లువా రెవ్వరు!

సీత—ఇయ్యది కారణంబుగ ముందేమేని ప్రమాదములు గలుగునని భీతి జనించుచున్నది.

రాము—కల్యాణీ! భీతిల్లకుము లక్ష్మణా! కాలోచితకృత్యములఁ దీర్చుకొనుటకు వేళయైనది. లోనికేగుదమురండు.

(నిష్క్రమింతురు)

తెర వ్రాలును.

## ద్వితీయరంగము.

### పర్ణశాల.

(సీతారాములు ప్రవేశించియుండ తెర లేచును.)

రాము—కల్యాణి! నీవు నాచెంతనుండుటఁజేసి యరణ్యావాస క్లేశము సుమంతయుఁ దోపకున్నది. అభ్యాసవశమున నరణ్యావాసమే సుఖముగా నున్నది.

సీత—ఏమిసుఖము. ఎప్పు డేరక్కసుని మూలమున నెట్టి యిక్కట్లు వాటిల్లునోయని భీతిల్లు మనసే యుండును.

రాము—భీరులారా! ఈపరిసరమున గల రక్కసులందఱునుపరలోకము కేగిరి. మనచేఁ బరాభవింపబడిన శూర్పణఖ యెందో భీతితోఁ నణగిమణగి యున్నది.

(ప్రవేశము—లక్ష్మణుడు.)

లక్ష్మ—అగ్రజా! ఫలపుష్పాదులదెచ్చి పర్ణశాలయుం ఉంచివచ్చితిని

సీత—నాథా! ఉల్లదే! ఆచాయజూడుడు, ఆబంగారులేడిని అదే చెంగుచెంగు మని యాలతాకుంజము చెంగట దాటుచున్నది. అయ్యది నాచెంగట నున్న జెలికత్తియలు లేనిలోపము దీరగలదు. అద్దానిని దెచ్చి యొసంగరా? (19)

రాము—ప్రియా ! అటులయిన గోసివచ్చెద.

లక్ష్మ అగ్రజా ! వలదువలదు ! ఎక్కడనైన బంగారు లేడి యుండునా మనల మోసగింప నెవ్వడో యీరూపమున వచ్చియుండనోపు నని యూహించుచున్నాడను.

రాము—లక్ష్మణా ! నీవనినట్లుగా రక్కసుడైన బడిమార్చెద లేకున్న భూజాతకోర్కె దీర్చెద రెండును మన కవశ్యాచరణీయ ములేగదా ! మీావదినెను జాగరూకతో జూచుచుండుము పోయివచ్చెద. (నిష్క్రమించును)

సీత—(రాముని పరికించునటుల నటించుచు, ఆ పసిడిమృగమును బట్టుకొనుటకై యెంతశ్రమ పడుచుండిరి . అయ్యయ్యో! నిష్కారణముగా నాథుని నలయించిన దాసనైతినే!.. .. ఏమిది. లేడియు మీాయన్నగారుఁగూడ గాన్పించుటలేదు. లక్ష్మణా ! పరికించుము.

(తెరలో) లక్ష్మ ! రమ్ము ! రమ్ము !!

సీత—(భయపరికంపితయై) లక్ష్మణా ! వింటివా ! మీాయన్నగారియార్తనాదము త్వరితముగా నాతనికి సహాయమొనరింపఁబొమ్ము కదలుము ఇంకను యిచ్చటనే యుంటివా?

లక్ష్మ—అమ్మా ! జగదేకపూజ్యుండగు శ్రీరామచంద్రున కెన్నడైన నాపద కలుగునే- జననీ! సందేహింతువే? అన్నగారి పరాక్రమమీావుమాత్ర మెఱుఁగవా? అంతిమొగాక- ఆయార్తారవము సోదరుని దైనట్లు దోపదు. రక్కసు డెవ్వడో యట్టులరచి యుండును.

సీత—నిన్నటిదనుక నామాటలు శిరసావహించు నీవు-నేడేల నా పల్కులయెడ నాదరముంపకుంటివి. కష్టదశయందున్న యగ్రజుని యార్తనాద మాలించియు పోకున్న నినుజూడ . నేను

నీకెట్టిదో విపరీతబుద్ధి బుట్టియున్నదని తోచుచున్నది...... (ఆలోచించి) తెలిసెను నీదుర్మార్గపుటాలోచనము. రాముడు పరలోకమున కేగిన నన్నుపరిగ్రహింపవలయుననిదలంచితివా! దుర్మతీ! జీవనమునైన విడతునుగాని నీకుమాత్రము వశ్యురాలను గాను......ఎక్కడి సోదరులు. ఒక్కసోదరుఁడు రాజ్యము నపహరించెను. వేరొక్కడు భార్యనపహరింప దలచుచుండెను.

లక్ష్మ—జననీ! కఠోరవాక్యములాడెద వేల? అన్నయానతినతిక్రమించి వర్తింపభీతిల్లుచుంటిని. నిన్నిచ్చట నొంటరిగా దిగవిడిచి చనిన నేమాపదయైన కల్గునేమోయని భీతిల్లుచుంటిని. కాని నీకఠోరవాక్యముల విని సహింపఁజాలకుంటిని. జాగరూకతతో నుండుము పోయివచ్చెదను. (నిష్క్రమించును.)

(ప్రవేశము రావణుఁడు.)

రావ—(తనలో) ఏమీ లతాతన్వి సౌందర్యము. ఇట్టి త్రిజగన్మోహిని నేఁడున జూచియుండలేదు. ఈమెను నాయర్ధాంగిగాఁ జేసి కొనిన నాజన్మ సార్థకమగును. (20)

సీత - మునీంద్రా! నమస్కారము.

రావ—మనోవాంఛితఫలసిద్ధిరస్తు లతామణీ నీపేరెవ్వరు- నీనాథుఁ డెవ్వఁడు. నీసుందరాకారం బీయడవి పాల్జేయుచుంటివేల?

సీత—మునీంద్రా! మామామగారగు దశరథేశ్వరుని పంపున నరణ్యావాస మొనరింపవచ్చిన నాపతితో నరుదెంచితిని. నావిభుఁడను. మఱిదియు నరణ్యముల కేగిరి వారిరువురును కొలదికాలంబున నరుదెంచి తగురీతిని సత్కరింతురు అంతవఱకీయాసనమున గూర్చుండుము.

రావ—తరుణీమణీ! నీవృత్తాంత మెఱింగించితి నిక నావృత్తాంతముఁ

గూడ వినుము కమలభవుండు నాపితామహుండు. జగద్విఖ్యా
తుఁడగు విశ్రవసుండు నాజనకుఁడు- స్వర్ణవికారమైన లంకా
పురంబు నివాసము- ముల్లోకంబు లొక్కపెట్టున నాక్రమింప
జాలిన దైత్యవల్లభుడను రావణుఁడనువాఁడను. ఇంక నావచ్చి
న పనివినుము లోకంబులనెల్ల నీవు చక్కని దానవని శూర్ప
ణఖచే విని. విరహాధరంబున ధైర్యంబుడిల్లవోవ మన్మథపీడి
తుఁడనై యిట్లు నదెంచితిని-నన్ను జేకొనుము- లంకారాజ్యము
నకు నిన్నధికారిణిగా నొనర్చెదనని నన్నుల మిలగుచుండెదను.

సీత—ఛీ! దురాత్మా! యిందుక తాళుము . నా విభుఁ డగుదెంగొనంత
నే నిము జక్కాడి ముక్తికాంక పని కర్పెరకును. (21)

రావ—తన్వీమణీ! నీవంగీకరింపకున్న బలిమినైన గొనిపోయెదను.
ఇంతవఱకు నీవు నా నిజరూపము జూడకుండుటచే నట్లను
చుంటివి. ఇదే చూడుము నానిజరూపము. (అని నిజరూపము
దాల్చును)

సీత—రామభద్రా! హా రామభద్రా! (మూర్ఛిల్లును)



తృతీయరంగము- -యుద్ధభూమి-



(ప్రవేశము అంగదుఁడు)

అంగదు-. (శ్రీరామచంద్రుని బాహువిక్రమము వర్ణింప నెవ్వనితరము-
ముల్లోకంబుల నొక్కపెట్టున నిర్మూలింపజాలిన బలుఁడగు కుం
భకర్ణుని నొక్కనిముషమున గూలనేసెను- అతికాయుం డాది
గాఁగల వీరులెల్లరును గతించుటచేతను కుంభకర్ణుఁడు కుంభినిపై
గూలుటచేతను రావణుడిప్పుడు తెక్కలుతెగినపక్షివలె నిస్స
హాయుఁడై యున్నాఁడు. ఇట్లుండినను వెనుకంజ యుఁకక యింకను

మా శ్రీరామభద్రుని జయింపవలయుననియే యద్దురాత్ముఁడు యత్నించుచున్నాఁడు అతనిపట్టుదల కెంతయును మెచ్చ వచ్చును.

(తెరలో) అంగదా ! ఎచ్చటనున్నావు.

అంగ—విభీషణా ! ఇటురమ్ము.

(ప్రవేశము విభీషణుడు.)

అంగ—విభీషణా ! విశేషములేమి? నాకొఱకై వెదకుచుంటివేల?

విభీ—ఓయీ ! కార్యము మించివచ్చుచున్నది. శుక్రాచార్య మతంబున నాసౌరరుం డిప్పుడు పాతాళహోమ మాచరించుచున్నాఁడట అయ్యది నిర్విఘ్నముగా నెఱవేరిన నాతని జయించుట దుర్ఘటము మన మెట్లయిన నద్దానికి విఘ్న మాపాదింపవలెను.

అంగ—సిద్ధముగా నుంటిని. కాని కార్యసాధనోపాయము దోచుట లేదు.

విభీ—గొప్పపరాభవమును జూపినగాని యాతఁడు నిష్ఠనుండి లేవఁజాలఁడు. కావున నీవాతని యంతఃపురంబునకుఁబోయి యాతనిభార్యను చెఱఁగొని యాతని యెదుటఁ బరాభవింపఁగడఁగుము.

అంగ—పాపము శమించుఁగాక పాపము శమించుఁగాక. విభీషణా ! నన్నిట్టి నీచకార్యమునకేల నియోగించెదవు.

విభీ—అంగదా ! నిన్నట్టి నీచకార్యములకు నియోగింతునా! ఇందొక్క రహస్యమున్నదాలింపుము. నీవు వాలికి మండోదరియందు బుట్టితివి కావున నీవామెనంటిన దోషములేదు. అందువలన పరమాత్మస్వరూపుఁడగు శ్రీరామకార్యార్థ మెట్టిపనియైనను ఆచరింపవలయును. ఇంతకును మఱొక్కఁడీకార్యమును నిర్వహింపఁజాలఁడు.

అంగ—మంచిది అవశ్యమాతని హోమమునకు విఘ్నమాపాదించి వచ్చెదను.

విభీ—రమ్ము! శ్రీరామచంద్రునికడ వసుజ్ఞగాని తత్కార్యమును సాధింపబోవచ్చును. (నిష్క్రి)

తెర వ్రాలును.



తుర్యరంగము.

(రావణుడు దీక్షతో హోమము చేయుచుండగా మండోదరి నిద్రించు నంగదుడు ప్రవేశించుచున్నాడు)

అంగ—ఓనక్తంచరాధమా! అమితబలుండగు సోదరుడు పడినను శౌర్యశాలియగు సుతుడు గూలినను మూలబలంబులెల్ల నాశనమైనను పట్టుదలవీడక నిట్లింకను హోమమాచరించుచుంటివే? ఆప్తులను బంధులను సుతులను గోలుపోయి జనశూన్యమగు రాజ్యము నింకను పరిపాలింప నలయుదనని దలంచితివా? యిదే చూడుము.

గీ. మున్ను శ్రీరాము నెలులనో • మోసగించి
యవనిజాతను వైకొంటి • వంతెగాని
నేడు బాహువిక్రమమున • నిమతీని
బట్టి తెచ్చితి చూడుమో • పంక్తికంఠ.

మాయాకృత్యవిశారదుండైన మారీచు సహాయమున భూజాతను దొంగిలించి తెచ్చితివిగాని నేను నిభటులెల్ల మాన్పడి చూచుచుండ బాహుబలంబున గొనివచ్చితిని. పరాక్రమమున్న బలమున్న శౌర్యమున్న రమ్ము నాతో బోరొనర్చి నిభార్యను సంరక్షించుకొనుము. లెమ్ము త్వరపడుము. నిజభార్యను సంత

క్షమించుకొనవేరవి నీకీహాతాళాహాళము కుందులకు పరకాంతా
కర్షణ ప్రయత్నమెందులకు లెమ్ము.

మండో—ప్రాణేశ్వరా! నిశ్చింతమై యొక్క వనచరుండు నీభార్యను పరాభవించుచుండ చూచుచు నూరకుందువా? అప్రయోజకునకగిది నీభార్య నోరాలు గొనిపోయి పరాభవించుచుండ నూరకుందువా? పగవానిచేబడిన నాదెసచూడవేల? వీనినేల వధింపవు. కోరవిచే తలగోకికొనినట్లు సీతామహాసాధ్విని గొని తెచ్చితివి. లంక కిట్టిచేటొనగూర్చితివి. కుమారుని సోదరుని జంపుకొంటివి. నిజభార్యాపరాభవమును కండ్లారగాంచుచుంటివి—జీవితేశ్వరా! ఇట్లూరకుండుట నీకుదగునా?

రావ—(తనలో) సర్వనాశనమైనది. (లేచి ప్రకాశముగ) దురాత్ములారా! చచ్చితిరి దేకాచుకొనుడు (బాణముల విడుచును.)

అంగ—(తనలో) చేయవలసిన కార్యము నిర్విఘ్నముగా ననకొనిన రీతిగా జరిగినది (నిష్క్రమించును.)

మం—(సమీపించి) నాథా నాతుందిపల్కు లాలింపుడు విష్ణుస్వరూపుండగునమ్మహాత్మునితో బోరి జయించుట దుర్లభము. ఇంకనైన నాపల్కులాలించి సీతామహాసాధ్విని రామచంద్రుని కర్పింపుడు. యాతని శరణువేడుడు.

రావ—ప్రియా! నిపల్కులు నాకు రుచింపవు ఏలనందువా వినుము

గీ. ఎరుగుదును నేను రాముండే • హరియటంచు
యతనిచే నాకు చావు స • త్యంబటంచు
పూర్ణముగ నేనెఱింగియే • పోవుచుంటి
ముక్తికాంతను క్షణములో • బొందుకొఱకు.

నాకొనర్చుచున్న యీహోమవిధ్వంసము గూడ నామరణమునే సూ

చింపుచున్నది. గెలిచిన కాంతామణిని గెలువకున్న ముక్తికాంతను వరింపగలను పొమ్ము. నీవు మాకు నీతులుపదేశింపవలసినకాలముకాలేదు.

మండో—నాథా వలదు. వలదు. హా! (మూర్ఛిల్లును)

రావ—(తనలో) ప్రేమపాశ మిప్పటికి దెంపుకొంటిని. రణభూమికేగెద. (నిష్క్రమించును.)

తెరవ్రాలును.



పంచమరంగము-యుద్ధభూమి.



(ప్రవేశము శ్రీరాముడు విభీషణుడు.)

శ్రీరా—ఓయీ! విభీషణా! ఇదేమియో మాయగానున్నది. ఎన్నిమార్లు దునిమినను శిరంబులు మరల నుద్భవించు చున్నవి

గీ. తలలుచేతులుదునిమి దో • ర్బలముజూపి
విసివితినిగాని ప్రత్యర్థి • హీనమైన
గాసినొందడు యింక నే • కరణివీని
దునిమిచుట్లులో మదిలోన • దోపదయ్యె.

విభీ—స్వామీ! చతురానన వరప్రసాదమున వీనినాభియం దమృతము కుండలాకృతినున్నది. అయ్యది కారణంబున దలలుచేతులు తెగియు మరల నుద్భవించుచున్నవి కావున నాభిఛేద్యాటకు యత్నింపుము

[ప్రవేశము—రావణుడు]

రావ—విభీషణా! ఎంత జేసితివి! నారహస్యములన్నియు నెఱింగించితివా? యింటిగుట్టుదెల్పి లంకకు చేటొనగూర్చెదవా? రామా!

ఈశరమును దప్పించుకొనజాలవు యీ యస్త్రమున నీవో
నేనో కూలవలయును (శరము విడచును)

రాముడు—(తప్పించుకొని) శరసంధానమన్న సామాన్యముగ నెంచి
తివా? యింక నాయస్త్రప్రభావమును జూడుము

మ. చపలత్వంబున డాఁగి హేమమృగమై • సంప్రీతి బుత్తెంచుటో
కపటబ్రాహ్మణమూర్తిపై యబలనా • కాంతారమధ్యంబునం
దపలాపించుటయో మదీయశిత ది • వ్యామోఘ బాణాగ్ని సం
తపనం బేగతి నోర్చువాడవు దురం • తం బెంతయున్ రావణా!

(శరమును విడుచును)

రావ—శివ-శివ! శి-వ_శి-వ—(చనిపోవును)

రామ:—దుష్టసంహారమైనది యిఁక నారాక కాంక్షించువారలకు
ముదము గలుగజేసెదను (నిష్క్రమించును)

తెర వ్రాలును.





శ్రీ

# సంగీతవిష్ణులీలలు

# కృష్ణావతారము.

## ప్రథమరంగము.

[ప్రవేశము—చంపక నీలవేణి రాధ కమల]

రాధ—చంపకా ! బాలకృష్ణుని చర్యలన్నియును నద్భుతములుగానున్నవి. చంటిపాపడై చనుగుడుప వచ్చిన పూతన యనురక్కసి నుక్కడంచెను. తృణావర్తాదుల యమలోకంబున కనిపెను యీతని చర్యలన్నియునుం గడుంగడు జోద్యంబులయ్యెడి

చంపక—ఇట్టి యమానుషకృత్యంబు లాచరించుటకు జాలినపూరుషు డెవ్వాడు ఈతడు నిక్కముగా దేవాంశసంభూతుడగును

కమల—అయిననేమి, యింత దుండగీడుతనమా !

నీల—దేవాంశసంభూతుడని మీకుదోచినచో యీయిండ్లగల పాలుపెరుగులన్నియు నాతనికి సమర్పించుము సామంతులు గనుక మీరట్లుచేయగలరు కాని మాకట్లాచరింప లేరుకదా!

కమల—ఓసీ నీవుయూరగలు పాడుగాన! గోపబాలురతోగూడి చెప్పుటకు సిగ్గగుపనుంగూడ జేయుచున్నాడు బాలుడని

మన్నించి యూరకొందుమన్న యాతని తుల్లరిచేష్టలు సహింప నీయకున్నవి.

నీల.—రమ్మా యశోదమ్మగారివద్దకేగి యాతని కొంటెపను లన్నియును జెప్పి శిక్షింపఁజేతము. (తొందరపడి కమలను లాగును)

రాధ—ఏమే! నీకంతతొందర మేమును. మీతో నరుదెంచెదము మా పాలుపెరుగుల నొక్కనాడేని విడిచిపెట్టలేదు. యీవృత్తాంతమా యశోదమ్మతో జెప్పవలయుననియే బయలుదేరితిమి

కమల—అట్లయిన రండు పొద్దుపోవుచున్నది.

చంపక—నడువుడు. (పరిక్రమింపగా తెరలేచును.)

(ప్రవేశము-యశోద)

యశో—ఏమే చంపకా! గుమిగూడి నల్వురును-యిట్లరుదెంచిరి-రాకరాక వచ్చితిరి కూర్చుండుడు

చం—ఏమున్నది బాలకృష్ణుని తుల్లరిపనులంతకంత కధికమగు చున్నవి పాలుపెరుగుల నొక్కదినమునైన మమ్మనుదినసీయడు.

నీల—పాలుపెరుగులేకాదు! మీగడ- వెన్న- నేయి- కంటికగుపడనీయడు. వెన్నదినుచుండ నెవ్వరైనగాంచి యడ్డువచ్చిన- దిట్టి జెక్కులఁగొట్టి జెక్కకతనదారిని బోవును-

రాధ—యశోదా! ఏమిచెప్పుదును మీకృష్ణుని చర్యలు.

క. మగువా నీకొమరుఁడు మా
మగవారటుపోవఁజూచి • మంచసమునకుఁ
దగఁజేరిపొందనడిగెను
జగముల మున్నిట్టి శిశువు • చదువంబడెనే.

కమల—తల్లీ మీకృష్ణుని దుండగముల వర్ణింప నేరి తరము-మా యత్త జలకమాడుచుండ నట కేతెంచి సరిహాసమునను వ్వ వలువనుకొని పరుగులిడెను.

క. చేబంతి తప్పిబడెనని
ప్రాబల్యముతోడవచ్చి • భవనము వెనుకన్
మాబిడ్డ జలకమాడఁగ
నీ బిడ్డడు వలువఁదెచ్చె • నెలతుకతగునే?

చంపక — తల్లీ ! ఏమని విన్నవింతును

క. వెన్నదినఁగఁ బోడగనిమా
పిన్నదియడ్డంబువచ్చి • పెరదికిఁదివియన్
జన్నోడసిపట్టిజీరెను
జన్నికుమారుండె యతఁడు • శీతాంశుముఖీ !

కమ —

క. కడులచ్చి కలిగెనేనిం
గుడుతురు గట్టుదురుగాక • కొడుకులనగుచున్
బడుగులవాడలపైఁ బడ
విడుతురె రాకాంతలెందు • విమలేందుముఖీ !

యశో — ఏమేమో ! మావానిమీద నేరములు చెప్పెదరు. కాని నాకుమారు డెప్పుడును నిట్టియల్లరి చిల్లరిపనులకుఁ బోవకు— మాకృష్ణుడునన్ను విడచి యొక్కనిముషమైన నుండఁడు.

తే. గీ. అన్య మెఱుఁగఁడు తనయాత : నాకుచూచు
మంచివాఁడీతఁ డెగ్గులు • మానరమ్మ
రామలార త్రిలోకాభి • రామలార
తల్లులార గుణవతీమ • తల్లులార.

మీరందఱే వచ్చి యిట్లు చెప్పుటచే మీరందఱును గుమిగూడి యాలోచించుకొని యిట్టినేరములు మావానిపై మోపుచుండిరి.

నీల — అమ్మా నిక్కమే వచించెదము. నీవు,నీకుమారుని క్రిమ్మళిక

లో నుండకున్న మేమిగాబ్రదుకంబున కొబ్బరకుండలేము.

క. ఓయమ్మ నీకుమారుఁడు
మాయిండ్లను పాలుపెరుగు • మననీకమ్మా
పోయెద మెక్కడికైనను
మాయన్నల సురభులాన • మంజులవాణీ!

యశో—కమలా! నీలవేణీ! మావానిపై నలుగకుము-కృష్ణునితోను నలు మాకలింది బుద్ధిసెప్పెదను యిప్పటికేగుము.

కమ—మంచిది. (గోపికలు నిష్క్రమింతురు)

యశో—నాకనులముందటనే యెల్లప్పు డాడుచుండును. అట్టికృష్ణుఁ డెటు గోపికల నగచాట్లబెట్టియుండును ఏమో! ఏసమయమునకో నాకనుగప్పి సందుచేసుకొనిపోయి యల్లరిసేసి యుండును. లేకున్నచో వారు నాతో నేల యారీతిజెప్పెదురు.

(ప్రవేశము:—కృష్ణుడు, బలరాముడు, గోపాలుడు)

గోపాలు—అత్తా! చూచేవా! కిట్టయ్య బావేంజేసెనో-

యశోద—యేమిచేసినాడు.

కృ—(చెప్పవలదని బెదరించుచున్నాడు.)

గోపాలు—అదుగో! అదుగో! చెప్పితే కొడతానంటున్నాడు నేను చెప్పను. నీవులేనప్పుడు నన్ను చావగొడతాడు

యశో—బలరామా! నీవుజెప్పుము.

గోపా—నేనే చెపుతాను మేమాడుకుంటూ యుండగానే. యొకచోట పెద్దగొయ్యతీసి_మన్ను ముద్దలు_ముద్దలుగా దీసికొని—

కృ—(బెదరించును)

గో—నీబెదరింపులకు_నాకుభయములేదు. అత్తా! చెప్పితే నమ్ముతావో లేదో అమట్టిముద్దలు. గుటుకు గుటుకు—మింగేశాడు వద్దు

వద్దంటే నామాటవినక వన్నుతిట్టి మన్నుంటే నాకిష్టమని యింకా పెద్దముద్దలుతీసి మింగేడు

యశో—బలరామా! నీవాతని వారింపలేదా!

బల—(తనలో) పరాత్పరునిమహిమ నెఱుఁగువారెవ్వరు. (ప్రకాశముగ) తినవద్దని చెప్పితిని.

యశో—ఏమిరా! కృష్ణా! నీమందగము లెక్కువయగుచున్నవి. గోపికలందఱును నీపై నేమేమో నేరములఁజెప్పిపోయిరి. నేడు నీయన్నయును యీబాలుడును మన్నుదినుచుంటివని చెప్పుచున్నారు. మన్నేల భక్షించెదవు.

క. మన్నేటికి భక్షించెదు
మన్నియమము లేలనివు • మన్నింపవు ని
యన్నయు సఖులును జెప్పెద
రన్నా మన్నేలమఱి ప • దార్థములేదే.

కృ—(తల్లిదగ్గర కేగి) అమ్మా! నామాటలాలించుము. నేనెన్నడును మన్నుదినలేదు. మన్నుదినుటకు వెఱ్ఱివాడనా! వీరిరువురకును నీవు నిన్నరాత్రి పెట్టినవెన్న పెట్టిలేదనుకోపమున నీతో నిట్లు చెప్పుచున్నారు.

యశో—ఏదీ నీవదనము మన్నుదినిన మట్టివాసన యెచ్చటికిఁబోవును.

కృ—శా. అమ్మామన్నుదినంగనే శిశువునో • యాకొంటినో వెఱ్ఱినో
నమ్మంజూడకు వీరిమాటలు మదిన్ • నన్నిప్డు కొట్టంగ వీ
రిమ్మార్గంబుఘటించిచెప్పెదరు కా • దేనిన్ మదీయాస్యగం
ధమ్మాఘ్రాణముసేసి నావచనముల్ • దప్పైనదండింపవే.

యశో—(తనలో) ఇదేమి-యీతనివక్త్రమునందు సమస్తలోకంబులును బ్రహ్మవిష్ణుమహేశ్వరులును సప్తమహాఋషులును కులపర్వతంబులును యిదియదియననేల? సకలచరాచర భూతము

టులతో నిండియున్న యీజగంబెల్లను గాన్పించుచున్నది. అదే నేను నానాథుఁడు గోవులుగోపికలుగూడ యీతనిముఖంబున నే యున్నారము. ఇట్టిమహామహుడు కేవలము బాలుఁడని దలంపరాదు. సర్వవ్యాపియగు నాశ్రీమహావిష్ణు వీరూపంబున నవతరించియుండెను.

(22 అనుబంధము)

ఆ. వె. ఏమహాత్ములవలన ♦ నీవిశ్వరూపంబు
గానఁబడిరిమె బుద్ధి ♦ కంపమయ్యె
నా మహాత్ముఁవిష్ణు ♦ నఖిలలోకాధారు
నార్తులెల్లబాయ ♦ నాశ్రయింతు.

కృ—(తనలో) ఈమహాసాధ్వి నన్ను పరమేశ్వరునిగా దలంచుచు-తనకుమారుఁడనుట మరచినది. యోగమాయాప్రభావమున నీ మెను భక్తిమార్గమునుండి మరల్పవలయును. (అట్లొర్చును)

యశో—కృష్ణా! నీవు మన్నదినలేదు నీయన్నయు నిగోపాలుఁడును కల్లలాడుచుండిరి. రండు మీకన్నముపెట్టెద. (నిష్క్రమింతురు)

తెరవ్రాలును.

ద్వితీయరంగము.

(ప్రవేశము:—యశోద)

యశోద—కృష్ణునిదుండగములు మేరమీరుచున్నవి. ఈకురప్రనిచేష్ట లన్నియును సహింపరాకున్నవి.

సీ. బాలుఁడీతండని ♦ భావింతునందునా
యేపెద్దలును నేర ♦ రీక్రమంబు

వెలవెలఁగుటకునై • వెలవిం తునఁదునా
కలిగితే కొక్కఁడు • గానిలేదు
వెలుపులో నాబుద్ధి • వినిపింతువందునా
తనుదానయై బుద్ధి • దప్పకుండు
నొండెఱుఁగక యింట • నుండెదనందునా
జొచ్చిచూడనిదొక • చోటులేదు
తన్ను నెవ్వరైన • దలపోయ బారెడి
రోజలేమభీతి • యొకటియెఱుఁగ
డెలమిమారకుండ • డెక్కసక్కెములాడు
బట్టిశాస్తి సేయు • భంగియెట్లు.

ముద్దుకుమారుఁడని మందలింప కూరకొన్న కొలఁది యీతని యల్లరి పనులధిక మగుచున్నవి. ఉట్టిపై బెట్టియుంచిన వెన్ననంతయు దినివైచి భాండమును బగులగొట్టి పారిపోయెను. ఇట్టితుంటరి యెట్టిపనునైన జేయఁగలడు బట్టిశిక్షింపవలయునని యత్నించుచుంటిని. ఇంతలో నాయింగిత మెఱిఁగి కాబోలు పరువెత్తెను. ఎక్కడి కేగఁగలఁడు. ఈసమీపముననే యెక్కడనో నక్కియుండును. నలుమూలలుజూచి అదే! ఆమూలనేమియు నెఱుఁగనివానిపోల్కి గూరుచున్నాఁడు. పరువున బోయి యాతని బట్టుకొని బంధించి యుంచెదను. (నిష్క్రమించును.)

(ప్రవేశము:—కృష్ణుఁడు రోలీడ్చుకొనుచు)

కృ—ఎంతయో విశ్వప్రయత్న మొనరించినను బట్టుకొని యీరోటను బంధించెను. ఎవ్వరిచేతను బంధింపబడనినేను. నేటికి నాచే యీరోటికి బంధింపబడవలసి వచ్చినది. కానిమ్ము. ఇప్పుడు మద్దివృక్షములై పడియుండి నారాకకై నిరీక్షించుచున్న నలకూబరమణిగ్రీవులకు శాపవిమోచన మొనరించెదను.

(మద్దిచెట్లమధ్యనుంచి దోగివచ్చుచు చెట్లుకూలిపోవుచు చెట్లనుండి
నలకూబర మణిగ్రీవు లుద్భవింతురు.)

నల—శ్రీకృష్ణా !

కం॥ భువనములు నేయఁగావఁగ
నవతీర్ణుఁడ వైతి కాదె ♦ యఖిలేశ్వరయో
గివరేణ్య విశ్వమంగళ
కవిసన్నుతి వాసుదేవ ♦ కల్యాణనిధీ !

మణి—ఓదేవదేవా !

శా॥ నీపద్యావళు లాలకించుచెవులున్ ♦ నిన్నాడువాక్యంబులున్
నీపేరన్ బనిసేయుహస్తయుగముల్ ♦ నీమూర్తిపైఁజూపులున్
నీపాదంబుల పొంత మ్రొక్కు శిరముల్ ♦ నీసేవకైఁ జిత్తముల్
నీపై బుద్ధులు మాకునిమ్ము కరుణన్ ♦ నీరేజపత్రేక్షణా !

శ్రీకృ—నలకూబరమణిగ్రీవులారా ! నారాక కాంక్షించుచు నన్నే మీ మానసమందు ప్రార్థించుచుండుటం జేసియు నాదర్శనమగుట చేతను మీరు కృతార్థులైరి.

క॥ తమతమ ధర్మముదప్పక
సముఖులైనను నమ్రతిరుగు ♦ సభ్యులకును బం
ధమునను జూడగవిరియును
గమలాప్తుఁడు వెడలవిరియు ♦ ఘనతనుమ క్రియల్.

యింకమీరు మీలోకంబున కేగుడు.

మణి—నల—మహాప్రసాదము. (నిష్క్రమింతురు)

(ప్రవేశము—నందాదులు)

గొల్లఁడు—మద్దిచెట్లు కూలినవి-(కృష్ణుని సమీపించి బంధనము లూడ్చి) బాబూ నీకేమియు దెబ్బతగుల లేదుగదా ! దైవము యొచే నిప్పటికి మనకృష్ణునికి నూమంతయు మొసుగలుగ లేదు.

నంద—ఇంకనిచ్చోట నుండగూడదు. ఎవ్వరోయొకరు మనకృష్ణుని కెగ్గుసేయవలయుననియే దలంచుచుండిరి.

ఉ. ఇక్కడ నుండురే మనుజు • లీమన కృష్ణుని కెగ్గుసేయగా
రక్కసురాలు పూజన్నానగ • శాలపయిం బడిగాలివీచ బై
టిక్కిరియన్ దరుల్ పడిరె • గోకులవత్సప దప్పె జాలునే
డెక్కడికైన బోవలయు • నింకిటగోపకులార వింటిరే!

2 గొల్లడు—తప్పకుండాపోవాలి

3 గొల్లడు—నాకు తోచింది సెపుతానినండి.

క. కసవుగల దిరవుపసులకు
లసదద్రినదీమహీజ • లతికావలి పెం
పెసగును గాపురము నకును
బొసగును బృందావనంబు • పోదమచ్చోటికిన్

నంద—నీవు చెప్పినది గూడ నాలోచింపవలసినదే. మనగోవులకుం గావలసినది కసవు. అయ్యది కొల్లలుగ లభించు స్థలము బృందావనము. గాన నింక సంకోచింపబనిలేదు. మీరుమాటాడక యచ్చటికేగుటకు ప్రయాణము కండు. (నిష్క్రమింతురు)

తెర వ్రాలును



తృతీయరంగము.

బృందావన సమీపారణ్యము.

ప్రవేశము—బ్రహ్మ.

బ్రహ్మ—ఈతని మహాత్మ్యమెద్దియో పరీక్షింపవలయునని గోవులను గోపాలురను గూడ గృహాయందుంచి దాచితిని. ఆగోవులకొరకై కృష్ణుడు వన్నెకేరి యడుగకమానడు. అదే వెదకుచున్నాడు.

శా. కర్ణాలంబితకాకపక్షములతో • గ్రైవేయ హారాళితో
స్వర్ణాభాసితవేత్రదండకముతో • సత్పింఛదామంబుతో
బూర్ణోత్సాహముతో దృతాన్నకబళో • త్ఫుల్లాబ్జహస్తంబుతో
దూర్ణత్వంబున నేగఁ లేగలకునై • దూరాటవీవీథికిన్.

ప్రచ్ఛన్నముగ నితని వెంట నంటి ఏమి సేయునో బరికించెదగాక.

(నిష్క్రమించును.)

(ప్రవేశము:—కృష్ణుడు)

కృ—(తనలో ఎంత వెదకినను గోవుల జాడయే గాన్పింపకున్నది. (ఆలోచించి) ఆ- తెలిసినది. చతురాననుండు నాప్రభావ మెఱుంగగోరి గోవులను గోపాలురను దాచివైచెను. మోసమునకుఁ బ్రతిమోసము పన్నవలెను. నేనే గోగోపకుల రూపంబున వర్తించెదను. (నిష్క్రమించును)

(పునఃప్రవేశము.—బ్రహ్మ)

బ్రహ్మ—వెరపింపఁబోయి వెరచినట్లయినది. కృష్ణుని వంచింపదలచి విశ్వప్రయత్న మొనర్చి విఫలీకృతమనోరథుండనై యాతనిచే వంచింపబడితి. గోగోపాలురను మాయము చేసిన తానే గోగోపాలుర రూపంబుల ధరించి చరించుచున్నాడు...ఆహా! ఈతని మహిమార్ణవంబును గొనియాడ యాదిశేషునకైన దరమా. ఈకృష్ణుని జూచుచు నానందించు యీ గోపాలురే ధన్యులు.

ఉ. ఎన్నఁడునైన యోగివిభు లెవ్వని • పాద పరాగమింతయున్
గన్నులఁగానరట్టి హరి • గౌగిటఁ జేర్చుచుఁ జెట్టఁబట్టుచున్
దన్నుచుఁ గ్రిద్దుచున్నగుచుఁ • దద్దయుఁ బైఁబడి గూడియాడుచున్
మన్ననసేయు వల్లవకు • మారుల భాగ్యము లింతయొప్పునే.

అతఁడే కృష్ణు డొంటిగ నందు గూర్చుండెను, నేఁబోయి యాతనియొద్ద నానేర మొప్పుకొని కృతార్థుఁడ నయ్యెద. (నిష్క్రమించును)

(తెర లేవగా కృష్ణుడు ప్రవేశించును)

కృ—చతురాననుండు గోగోపుల దాఁచిపెట్టి దాదాపుగా నొకవత్సర మయ్యెను, ఇంకను నాతనికి నా ప్రభావ మెఱుకబడినట్లు కాదోపను. (ఎదుట జూచి) అదే బ్రహ్మగారరుదెంచు చుండిరి.

(ప్రవేశము—బ్రహ్మ)

బ్రహ్మ—శ్రీమన్నారాయణా! నా నేరమును సైరింపుము. నిన్నెఱుంగలేక నియెడ మూఢుఁడనై వర్తించితిని. (23)

సీ. శంపాలతికతోడ • జలదంబు కైవడి
మెఱుఁగు టొల్లియతోడ • మేనివాని
గమనీయ మృదులాన్న • కబళ నేత్ర విషాణ
వేణు చిహ్నంబుల • వెలయువాని
గుంజావినిర్మిత • కుండలంబులవాని
శిఖిపింఛ వేష్టిత • శిరమువాని
వనపుష్పమాలికా • వ్రాతకంఠమువాని
నలినకోమలచర • ణములవాని
కరుణఁగఁ జలుకొనిన • కడగంటివాని గో
పాలబాలుభంగి • జరగువాని
నగుమొగంబువాని • నను గన్న తండ్రిని
నినుభజింతు మ్రొక్కి • నీరజాక్ష.

మ. నను మన్నించి భవజ్జనంబులకు నా • నందంబు నిండించు ని
తఁగురూపంబిదె నామనంబున కచిం • త్యంబయ్యె నియుల్లస
ద్ఘన విశ్వాకృతి నెవ్వఁడోపు నెఱుఁగన్ • గైవల్యమైయొప్ప నా
త్మునికేవ్యంబగు నీదు వైభవము చం • దం బెట్టిదో యోశ్వరా!

క. ఘోరాతుషారకీకర
భారజములకైన లెక్క • బుధు లిడుదురు భూ
భారవతీర్ణకరుడగు
నీరమ్యగుణాలి నెన్న • నేరరగణ్యా.

ఓపురాణపూరుషా !

మ. ఒకఁడై యుంటివి బాలవత్సములలో • నొప్పారితీవంతటన్
సకలోపాసితులౌ చతుర్భుజులునై • సంప్రీతినే గొల్వఁగా
బ్రకటశ్రీగలవాడవైతి వటుపై • బ్రహ్మాండముల్ సూపి రో
ల్లక యిట్లొక్కఁడవైతి నీవివిధకే • లత్వంబు గంటింగదే
శా. దేవా నీచరణప్రసాదకణ లంబ్ధింగాక లేకున్న నొం
డే వెంటం జను నీమహామహిమ నూహింపంగ నెవ్వారికిన్
నీవారై చనువారలో నొకఁడనై • నిన్ గొల్వు భాగ్యంబు నా
కీవే యిప్పటి జన్మమందయిన నొం • డెందైననో యీశ్వరా !
మ. నిను హింసించిన పూతనాదులకు మున్ • నీ వేటి సంకేత మి
చ్చిన నీకుం బరదారపుత్త్రగ్రహ గో • స్త్రీప్రాణదేవాదు లె
ల్లను వంచింపగ యిచ్చు గోపకులకున్ • లక్షింపనేమిచ్చెదో
యని సందేహము తోచుచున్నది ప్రపన్నా నికరక్షామణీ !
లోకేశ్వరా ! భవద్దివ్యపాదారవింద మరందపానప్రమత్త చిత్తుడనై
మెలంగున ట్లనుగ్రహింపుము.
కృ—చతురాననా ! సంతసించితిని. యిందు నియొనర్చిన దేమియును
లేదు. అయినను నీకోరిన వరమిచ్చితిని.
బ్రహ్మ—నారాయణా ! పురాణపూరుషా ! భవద్దర్శనంబున కృతా
ర్థుఁడనైతిని. సెలవొసంగిన నాలోకంబున కేగెదను.
కృ—మంచిది పోయిరమ్ము.
బ్రహ్మ—(నిష్క్రమించును.)

కృ—బ్రహ్మచే దాచియుంచబడిన గోగోపాలురదే వచ్చుచున్నారు. నామాయ నుపసంహరించి వారల నెదుర్కొందును. (నిష్క్ర-)



### తృతీయతరంగము—యమునాతటి.

[ప్రవేశము :—కృష్ణుడు_ కాళీయునిపై తాండవమాడుచు యిరువురు. నాగాంగనలు- చెలియొకవైపునను జేరి స్తుతించుచుందురు]

నాగ—దేవదేవా ! అరిషడ్వర్గంబుల జయించి యింద్రియనిగ్రహము గలవారలై మునివృత్తిని కాననంబున మెలంగుచుండెడి యోగీశ్వరులకైన దుర్లభుండవగు నీవు. యీఫణీంద్రునిపై నటించు చుంటివి యిట్టి మహాద్భాగ్యమొంద నీఫణి పూర్వ మేమి యొనర్చెనో.

ఉ. ఎట్టి తపంబుసేసెనొకొ • యెట్టి సుకర్మములాచరించెనో
యెట్టి నిజంబువల్కెనొకొ • యీఫణిపూర్వభవంబునందు ను
న్నట్టి మహానుభావులకు • నెన్నడు జేరవగాని నీవు నే
డిట్టి వినోదలీల దల • లెక్కనటించెద వీఫణీంద్రుపై.

ద్వితీయ—కృపాపూర్ణభావా !

మ. బహుకాలంబు దపంబుసేసి వ్రతముల్ • పాటించి కామించి నీ
మహనీయోజ్జ్వల పాదరేణురణ సం • స్పర్శాధికారంబు శ్రీ
మహిళారత్నము తొల్లి కాంచనిదె, నీ • మంచేనియున్ లేక నీ
యహి నీపాదయుగాహతింబడసెనే • యత్యద్భుతంబీశ్వరా !

1 నా—యదుకులభూషణా ! నిజభుజగర్వ ప్రమత్తచిత్తుండైన మద్భర్త యెన్నియో నేరము లొనరించెను. తండ్రి తనయుని తప్పిదముల మన్నించి మంచిమార్గమునకు దెచ్చుకీతిని మాధవ సరియైన మార్గమునబెట్టి మాకు బతిభిక్ష పెట్టుము.

ఉ. నేరము లెన్ని యెక్కడివి • నేముదలంచుదలంపులోపలన్
నేరుపులున్న వేసుతుల • నేరమి తండ్రులు ద్రోచిపుచ్చిరే
నేరముసేయువారి ధర • నీపతు లోర్చకమాటు గావరే
నేరముగల్గు మద్విభుఁ • నేఁ డిటగావఁ గదే కృపానిధీ

2 నా.—ఈకాళీయుఁడు చిన్నవాఁ డనియు పాపకార్యము లాచరింప లేదనియు వక్కాణింపజాలము అయినను- వైధవ్యమను దుఃఖ సముద్రమున మునగనోపక నీపదాబ్జంబుల బట్టివేడుచుంటిమి. మాకుంబతి భిక్ష పెట్టి మమ్మునగ్రహింపుము.

శా. బాలుం డీతఁడు మంచివాఁడనుచుఁ జెప్పంగా రాము క్రూరుండు దు
ష్శీలుండౌ నప్పునైననేమి సుభగ • శ్రీబాసి వైధవ్యదు
ష్టాలంకారము బొందనోపము మహా • ధాలాప మాలింపవే
చాలున్నీపద తాడనంబు పతిభి • క్షం బెట్టి రక్షింపవే !

ప్రి—కమలామనోహరా !

ఆ. వె. మమ్ము పెండ్లిసేయు • మాప్రాణవల్లభు
ప్రాణమిచ్చి కావు • భక్తవరద
నీవుసేయుపెండ్లి • నిత్యంబు భద్రంబు
చిన్ననాటిపెండ్లి • పెండ్లికాదు.

ఇరువురును—లక్ష్మీమనోహరా ! జోహార్ ! జోహార్ ! (24)

కృ—నాగాంగనలారా ! చింతింపకుడు. కాళీయా ! నీభార్యల పాతివ్రత్యప్రభావమున రక్షింపబడితివి.

కం. గోవర్గముతో మనుజులు
ద్రావుదురీమడుగు నీరు • దగదిందుండన్
నీవును నీబాంధవులును
నీవనితలు వతులుజనుడు • నేడంబుధికిన్.

నాపదచిహ్నములఁజూచి గరుడుఁడు నీపై రాకుండును. గావున నిర్భీతితో రత్నాకరంబున నివసించి సుఖముండుము పొమ్ము.

కాళీ—మహాప్రసాదము. (తెర వ్రాలును)

---

## పంచమరంగము — బృందావనము.

(అక్రూరుడు ప్రవేశించుచున్నాడు)

అక్రూరు—కంసుని వినాశకాలము సమీపించినది లేకున్న నిట్టివిపరీతపు టాలోచనలు పుట్టియుండవు. ధనుర్యాగమను మిషపై రామకృష్ణుల మధురానగరంబునకు రప్పించి వధింప నెంచి యున్నాడు కాని, పూతన తృణావర్తాది రక్కసుల నుక్కర జంపిన యాకృష్ణుని. యాదివ్యపూరుషుని- మర్దింపగలఁడే! రామకృష్ణులు నిక్కముగ నాతో మధురానగరంబున కరుదెంచి కంసుని గర్వమడచి- జక్కాడెదరు...అయిన నాకేల యీతర్కవితర్కములు నా విధ్యుక్త కార్యమాచరించి- యా గోపాలకృష్ణుని దర్శించి కృతార్థుడనయ్యెద.. ఏమో సందియముగానున్నది - దుర్మార్గుడగు కంసునిచే పంపబడిన వానినని దలంచి - నీచునిగా దలంచునో లేక సర్వభూతాంతర్బహిర్వృత్య సంగతుల నామూలాగ్రముగా నెఱిగినవాడగుటఁజేసి - నా యంతరంగిక భావమును నెఱింగి నన్ను సుజనుగా దలచి యాదరించి మన్నించునో....తప్పక యాకృపాసింధువుఁడు నన్ను సుజనుగా దలచి యాదరించును. తనపాదసరసీరుహంబుల శిరమిడి నమస్కరించి నన్ను నిక్కృష్ణునిగా దలచునంతటి వా డాతడుగాడు.

ఇట్లు తర్కవితర్కములచేయుచు నిచ్చటనే నూహించుండనేల శీఘ్రముగ నేగి రామకృష్ణుల దర్శించి వారలకు నావచ్చినపని యెఱిగించి మధురాపురమునకు దోడ్కొని పోయెదగాక.

(నిష్క్రమించును).

తెరవాలును.

[ప్రవేశము—కంసుడు]

కంసు—(తనలో) పదివేవ్వరు బాలురనైననిముసమాత్రమున నుక్కడగింపజాలు కువలయాపీడ మీయుసువురిబాలకులచే పరలోకమున కేగినది- ఎవ్వరు నాయభీష్టము లీడేర్పరగిస విక్రమశాలులో యట్టి చాణూరముష్టికులు- రామకృష్ణులచే మడిసిరి యింకనీబాలకు పంపులెట్లు- వీరలనే జంపకున్న నాకు మనఃశాంతి లభించనా? -వీరలు జీవించియుండ నాకు మనఃశాంతి లభింపదు- నాయీనిశితకరవాలముననే వారల జక్కాడెదగాక.

(ప్రవేశము—కృష్ణుడు)

కృ—మామా! వెఱగున నిందు దాగొనవచ్చితివా! సంగ్రామవిజయులమగు మమ్మభినందించుటకు మారుగా దూషించి యవమానింప నోడితివా! మమ్ములజంపుమని సైనికుల కాజ్ఞయొసంగితివా! ఎంతశ్రమపడితివి మామా! ఇంతమాత్రపుబనికై సైనికులేల రమ్ము- నీశూరత్వమును జూపుము.

కం—వచ్చితివా! రమ్ము- నీకోరినట్లు నీశౌర్యబాలొసర్చి నిన్నంతకాలయమున కనిపెదను వెఱగుపడి రాలేను- యీఖడ్గమును గొనిపోవ నిచ్చటి కరుదెంచితిని- యీఖడ్గముచే నిన్ను వధించినాపగ సాధించుకొనియెదను-

కృ—నీ ఖడ్గము నన్ను దాకజాలను

కం—చూతుము. (అని ఖడ్గము నెత్తి వ్రేయబోయి కత్తికృష్ణుడగా మారుటజూచి పారవైచి-తనలో) యిదేమి వింతగానున్నది. (ప్రకాశముగా) ఓడింభకా! ఖడ్గముచేగాకున్న ముష్టిఘాతముల నినుజంపితి రెదిన. (అని దరిజేరబోవును.)

కృ—మామా! తప్పించుకొనుము! యీ దేహముతో నీవు నన్ను సమీపింపజాలవు.

కం—ఛీ! వాచాటా! నోరుమూయుము. (ముందుకుజూచి తనలో) నలువంకల కృష్ణుడేగలడు. ఎచ్చోటజూచిన నచ్చోటనే కృష్ణుడుగాన్పించుచున్నాడు ఎట్లీతని సమీపింతును.

కృ—గర్వపరిహారమైనదా నీవద్దకే వచ్చెదంచి-నన్ను సమీపింపగల సూక్ష్మదేహ మిచ్చెదనుండుము.

కంసు—అక్కడనుంటివా (రెండడుగులు నడచి కృష్ణుని బట్టుకొనబోయి క్రిందపడును)

కృ—శ్రమపడకుము: నీయవసానము సమీపించినది-యింక ముందైన నిట్టి యకృత్యముల నొనరింపకుండుటకై నిన్ను వధించెద. (అని యాతనివక్షముపై గూరుచుండి వధించి) ఇంక రాబోవు మహాభారతయుద్ధమున నెక్కుడు దుర్మార్గుల కూల్చి నాయవతారమును పరిసమాప్తినొందించెద. (నిష్క్రమింతురు)

తెర వ్రాలును






## బుద్ధావతారము.

క్షీరసముద్రము.

(ఇంద్రుడు-బ్రహ్మ శివుడు-నారదుడు మునులు యుండగా తెరలేచును.)

అందరు—(25)

(శ్రీమహావిష్ణువు శేషునిపై శయనించియుండును. లక్ష్మి పాదములొత్తుచుండును)

శ్రీమ—సురపుంగవులారా! మౌనిజనశేఖరులారా! చింతాక్రాంత హృదయులరై యున్నట్లు జూపట్టుచుంటిరేల?

నార—లోకరక్షకా! ఏమనినిన్న వింతును. నీవెఱుఁగనిదేమున్నది. అయినను మానోటినుండి వినఁదలచితివి- వినుము త్రిపురాసురులబాధలకు దేవేంద్రాదులెల్లరును దాళలేకున్నారు.

ఇంద్రు—దేవా! స్వర్ణరజత యయోమయనిర్మితములగు నాపురములఁ దమయిచ్చవచ్చినట్లు ద్రిప్పుచు_త్రిపురాసురులు లోకముల నలయించుచున్నారు.

బ్రహ్మ—మహాయోగిపుంగవుడగు మయుని ప్రాపులభించినదని కన్నుమిన్ను గానకున్నారు. వీరల నిప్పట్టున జక్కాడకున్న లోకసంక్షోభము చల్లారునట్లు దోపదు.

శివు—త్రిపురదానవులు వేదమార్గావలంబులగుటచే మాకు దుర్ని రీక్షకులైరి. ఇప్పట్టున మే మెవర్వగల దేమున్నదో దోచుట లేదు.

మునులు—నారాయణా! దగదంత్రకుండవగు నీవిప్పట్టున నుపేక్షచేసిన లోకములన్నియు భస్మీభూతములగును.

ఇంద్రు—దేవాది దేవా!

సీ. మత్స్యరూపమున సో • మకుమ్రించి యలనాడు
పాత్రిజదువులను గా • పాకినావు

బ్రహ్మ—కూర్మావతారివై • కుధరంబుమూపున
నిడుకొని సుధనుమా • కిచ్చినావు

శివు—కపటసూకరుడవై • కనకాక్షుజక్కాడి
భూదేవినానాడు • బ్రోచినావు

ముని—నారసింహుండవై • ఘోరదానవుజంపి
మూడులోకంబుల • బ్రోచినావు

ముని—వామనరూపివై • బలిబలంబులుమాపి
యమరులగాపాడి • యలరినావు

ఇంద్రు—పరశురాముడవౌచు • వసుధాధిపులద్రుంచి
ధరణిభారముమాన్పి • దనరినావు

బ్రహ్మ—రామావతారివై • రావణాదులగూల్చి
యెల్లలోకములను • నేలినావు

శివు—వసుదేవపుత్రవై • పాపాత్ముడౌకంసు
దుంచిలోకముల రక్షించినావు

ఇం—గీ. పెక్కుమార్లిటు దుష్టుల • నుక్కడంచి
త్రిపురదైత్యులునేడు యీ • రీతినుమ్మ

బాధపెట్టుచు నుండగాఁ • బరమపురుష
నీకృపాదృష్టి మామీద • నిలుపవేల?

నార— గీ. కామసంచారమొనరించి • భూమిమీద
బడినతోడనె దేశముల్ • పాడువారి
భస్మమగుచుండె నవలీల • పరమపురుష
యిట్టిపెనువింత గంటిమే • యెచటనైన.

లక్ష్మి— నాథా! ఈ రాక్షసాధముల జక్కాడి లోకంబుల జక్కపరుప వలయును.

ఇంద్రు— లక్ష్మీకళత్రా! ఆదానవుల బాధపడలేక మాబోంట్లెల్లరును తల్లడిల్లుచున్నారు.

వి— మహేంద్రాది బృందారకులారా! త్రిపురంబులవలన లోకములు వ్యాకులపడుట నెఱింగియు సమయ మరుదేరకుంకుటచే నెట్టిఁ గనివానిపగిది నూరకుంటిని. కాలవశమున నన్నియు సమకూడెను. మిమ్ముల్లను బిలచి యీవిషయమై మీతోఁ బ్రసంగింప వలయుననియే దలచుచుంటిని. ఇంతలోననే మీరరుదెంచిరి. త్రిపురనిర్మాతయగు మయుండు- తపశ్శాలి-అణిమాద్యష్టసిద్ధులఁ బొందినవాఁడు, ఆతఁడు తనయోగమహిమకు- తపశ్శక్తిని తోడ్పఱచి యీపురత్రితయము నిర్మించెను. అయ్యాదికారణంబుగ నీపురంబులకు కామగమనంబు కలిగినది- యింతియెగాక త్రిపురాసురులు వేదమార్గావలంబులు. అట్టియెడ వీరల మట్టుపెట్టు టసాధ్యమని దోచుచున్నది. అస్త్రశస్త్రములు వారల నేమియు చేయజాలవు.

లక్ష్మి— నాథా! అటులైన యీరాక్షసుల పీడ వదలించుకొనదగు మార్గమేలేదా?

వి— ఉన్నది కాని, యాదరించుట కష్టకతము.

నార—కష్టతమమైనను. కార్యసాధనమైనపిదప సుఖింపవచ్చునను యాశతో యుత్సాహముతో నద్దానిని జేసితిగదా మన.

వి—త్రిపురాసురుల సంహరించుటకు మున్ను సిద్ధరసకూపములోని యమృతమును హరింపవలయును లేకున్నచో వారలు నశింపరు.

ఇంద్రు—సిద్ధరసమును హరించుటెట్లు?

వి—తారకాసురాదులు వేదమార్గముల బాటింతురుగావున గోవ్రుల హింసింపనొల్లరు నేనును యీనలినోద్భవుండును గోవత్సక రూపములనేగి యాసిద్ధరసకూపమునం బ్రమాదవశమునబడి నట్లుబడి సిద్ధరసమును గ్రోలవలయును.

శివ—సిద్ధరసమంతరించినపిమ్మట వారు సులభవధ్యులగుదురా!

వి—అంతమాత్రముననేనా? కష్టతమమింకను ముందున్నదాలింపుడు. తదనంతరంబు నేనాత్రిపురాసురులకు బుద్ధరూపంబున నాస్తికమత ముపదేశించి వేదబాహ్యులగునట్లు జేసెద వారి భార్యల పాతివ్రత్యమహాత్మ్యముచే వారు మరల జీవింపకుండునట్లు జేయుటకై వారిస్త్రీజనంబులకు మానభంగమొనర్చెదను ఆపిమ్మట నిరీశ్వరవాదులును నిస్తేజులును నయినపిమ్మట వారల జక్కాడుట సులభము.

శివ—చాల చక్కని యుపాయము

వి—ఇంతకే సంతోషింపకుడు. వారల రూపుమాపుటకై ధరణిని రథంబుగాజేసి సూర్యచంద్రుల రథచక్రములుగాజేసి సారథిగ బ్రహ్మను, శరాసనంబుగ మేరువును తూణీరముగ వార్ధితురంగములుగ వేదములనుజేసి రథారూఢుండైన యీశంకరుండు నన్నే బాణముగ బ్రయోగించి యాత్రిపురంబుల నొక్కసారిగా గాల్పవలయును ఫాలలోచనుని నేత్రాగ్నిని నారాయణా

స్త్రముసకు మొలికగనిడి పృష్టభాగంబున చంద్రికళనిడి యా బాణము ప్రయోగింపవలయును. ఫాలలోచనుని నేత్రాగ్ని కే కున్న పురములు భస్మముగాజాలవు చంద్రికళలేకున్న దానవులు మడియరు ఇంతగ్రంథము నడపినగాని యారక్కసులంత మొందరు.

శివ—ఎంతకష్టము.

ఇంద్రు—అయినను ఆచరింపవలసియున్నది.

విష్ణు—కార్యసాధనోపాయ మెఱింగిరి గనుక సాధనకైగడంగుడు.

తెరపడును.

## ద్వితీయరంగము.

[తారకాక్షుడు కమలాక్షుడువిద్యున్మాలి ఉచితాసనములపై నుండగ దెర లేచును]

విద్యు—సోదరా ! తారకాక్షా ! ఇంద్రాదులెల్లను మనల నెల్లను సంహరింపుమని యాశ్రీహరిని వేడుకొన వైకుంఠంబున కేగిరని యింతకమున్న వినియుంటిని

తార — ఇంద్రాదులగువారెందరగూడినను మనల నేమిచేయగలరు?

తే. గీ. కదనమొనరింప సర్వజ • గములొనసి
మచ్చరంబున వచ్చిన • వచ్చుగాక
సిద్ధరసకూపమున •సమృద్ధిగాల
భించు పీయూషమండగా • వెఱపదేల?

(తెరలో)ధానవసార్వభౌములారా! ఎక్కడినుండియో యొకచక్కని పాడియావరుదెంచి ప్రవూదవశమునబడినట్లు సిద్ధరసకూపంబునందుబడి యమృత మునంతయును గ్రోలివైచెను,

తార—కమలాక్షా ! నీవేగి యానసమాచారకమును కనుగొనిరమ్ము.

[కమలాక్షుడు నిష్క్రమించి రెండవప్రక్కనుండి ప్రవేశించును.]

కమ—సోదరా ! ఒక్కబిందువైనను మిగులలేదు.

తార—ఆశ్చర్యమాశ్చర్యము.

కమ—మరియొక్క విశేషము—పానరసముతోగూడ గోవంతర్ధాన మయినది.

విద్య—అట్లయిననియ్యది శ్రీహరిమాయాకృత్యమయియుండవచ్చును.

[ప్రవేశము బుద్ధుడు.]

బుద్ధ—తారకాక్షా ! జయము జయము

తార—(తనలో) ముఖలక్షణములు పట్టిచూడ రాజకుమారునివలె నున్నాడు. వేషభావలు పరికింప యోగిపుంగవునివలె నున్నాడు. (ప్రకాశముగా) అయ్యా తమరెవ్వరో యెరుంగజేయుదురా.

బుద్ధ—ఓయీ ! బుద్ధుండను యోగిని.

కమ—తమ యోగప్రభావమున మాసిద్ధరసము నాటంచిన దెవ్వరో చెప్పుము.

బుద్ధ—యింకెవ్వరు మాయాస్వరూపుడగు శ్రీహరియే మిమ్ము మోసగించెను మీప్రవర్తనలబట్టియే మీకిట్టి యనర్థమురుదెంచె

తార—వేదచోదితపథంబున నడచు మాప్రవర్తన కేమిలోపము

బుద్ధ—మీలోపముల నిపుడు చూపెద వినుడు మీరు వెన్నుని దలంపరుగదా

గీ. విష్ణుచోదితమైనట్టి • వేదచయము
విష్ణుగుణకీర్తనము చేయు • వేదచయము
విష్ణుకైవల్య మొసగెడి • వేదచయము
బోధచేసెడి మార్గాన • పోవనేల.

ఆ వేదచోదితమార్గముల చరింపుచుండుటచేతనే యిట్టియిక్కట్లు సంభవించినవి. ఆమాట యటుండుడు వేదచోదిత యజ్ఞయాగాదులలో నొనర్పుటకై నోరులేని జంతువుల వధించుచున్నారే "అహింసాపరమోధర్మః" అను వాక్యమును మరచి వర్తించుటకు మీకు దగునా? మీరు దేవో స్వర్గసుఖములభించునని జంతువుల హింసించుచున్నారుగదా? పాపభీతికి జాకికదా యిట్లొనర్పుట? రాక్షసేంద్రా! యిటువినుము స్వర్గసుఖ మెప్పుడో లభించుననుట కల్ల నరకమున్నగనుట హుళిక్కి నరకమనునది యున్నచో జను లీభూలోకంబున కష్టపడు టెందులకు? జనులు తామొనర్చిన పాప మీలోకముననే యనుభవించుచుండగా నరకమెందులకు? గాన నరకములేదు నరకమే లేనిచో స్వర్గమాతకు మున్నేలేదు మానవుని భూలోక సౌఖ్య జీవనమే స్వర్గము—యింతకు వేరులేదు. కావున మనకు వలయు సౌకర్యము లన్నియును చేకూర్చుకొని భోగపరాయణులైయుంట మేలు.

తార—మీరనునది నిక్కువముగా దోచుచున్నది.

బుద్ధ—ఇంక మీచేయు మతిమాలిన పనుల నిరూపించెద చూడుడు. మృతినొందినవాని కేమేమియో పితృశ్రాద్ధమున నాబ్దికములు బెట్టుచుందు రేటికి. మీయింట భోక్తలు కుడచిన వానికి తృప్తి కలుగునా? కల్ల! కల్ల! పొరుపూరనున్న మీబంధువుకు భోజనసదుపాయ మమరదని మీయింట నొక బ్రాహ్మణునకు భోజనమిడిన పొరుపూరనున్న మీబంధువున కాకలినివర్తి యగునా? అట్టులే మీరొనర్చు యాబ్దికక్రియలవలన మృతునికి సంతృప్తి కాజాలదు.

తార—అయిన మమ్మిప్పు డేమిచేయమనియెదరు.

బుద్ధు—వేదచోదిత కర్మల విసర్జించి హింసవిహీనసర్వ ముక్తిమార్గ
ముసు సాధించుటకు యత్నించెదరు.
మువ్వురును—తమపాదములాన తమశిష్యులమైతిమి మరువ దేశించినట్లు
వర్తించెదము యీమతము మూడులోకముల వ్యాపింపచేయుదుము.
బుద్ధు—అట్లయిన నాతో రండు.
తార—మహాప్రసాదము. (నిష్క్రి)

---

## తృతీయరంగము

(ప్రవేశము-బుద్ధుడు)

బుద్ధుడు—తారకాసురాదులదరిజేరి వారికెల్లరకు నిరీశ్వరమత ముప
దేశించి వారును వారిప్రజలును వేదబాహ్యులగునట్లొన
రించితిని. వారిభార్యలచెంత కేగి వారలకుగూడ బౌద్ధమత
ముపదేశించి సంతానప్రాప్తికై గౌరీపూజమాని ఋతుస్నాత
లై రావిమొక్కల కౌగలించుకొనవలయునని జెప్పితిని. నా
యందుగల నమ్మకము చేతను వారట్లొనరింపగలరు. నేనయా
రావిమొక్కల రూపుదాల్చి వారికి మానభంగ మొనరించెద.
పాతివ్రత్యము భ్రష్టపటలమైన పిమ్మట వీరుగూడ నాథులతో
డనే యంతమొందగలరు. ఇంక నేనేగి తత్ప్రయత్నములో
నుండెద. (నిష్క్రి)

## తురీయరంగము

(రుద్రుడు రథియైయుండ నిరుపార్శ్వముల మునులు
దేవతలు యింద్రుడునిలచియుండ తెరతీయును.)

రు—ఇదే! తారకాసురుల సంహరించుటకై- త్రిపురముల భస్మము

వధించుటకై నారాయణాస్త్రమును బ్రయోగించెద (శరము విడచును) (తెరలో పెద్దధ్వని)

మునులు—జయము జయము (9)

ఇంద్రుడు—అదేశ్రీమహావిష్ణువు బుద్ధావతారరూపంబున నిట్లరుదెంచుచున్నాడు.

[ప్రవేశము—బుద్ధుడు,]

అందఱు—బుద్ధయోగీస్వరునకు జయ్.

బు—జగదీశ్వరా! భవదీయకరుణాకటాక్షముచే కాదె నీయసురులెల్ల గూలిరి,

రు—ఇత్యాది నీప్రభావమున గాదే! నేనిందు నిమిత్తమాత్రుడనైతి. లీలామానుషవిగ్రహుండవగు నీవు పైనుండి మాచే నిట్లాడించి వినోదించుచుంటివి

బుద్ధ—ఇంద్రా! లోకకంటకులగు తారకాసురులు తమపురంబులతో గూడ వశించిరి ఇంక నిచ్చోట గూర్చుండి గతించినదానిని గూర్చి తర్కవితర్కముల జేయుటెందులకు రండు మనరాకకెదురుజూచుచున్న వికుంఠపురవాసుల కీసుభవర్తమానమెఱింగింతము.

(అని నిష్క్రమింతురు)

తెర వ్రాలును.

గద్యము ఇదిశ్రీ రమారమణ చరణ సేవాతత్పర హరితస
గోత్రపవిత్ర మద్దూరివంశ లతాంకూర సరసమాంబా
సోమనార్యపుత్ర శ్రీరామమూర్తి నామధేయ
ప్రణీతంబైన సంగీత విష్ణులీలలు
సర్వమును సంపూర్ణము,



# అనుబంధములు.

(1) మరటరాగము-ఆటతాళము.

సత్య—ఓహో! - నా - జన్మ ధన్య - మయ్యె॥ నోహో॥
అ॥ వ॥ ఈ విరాట్స్వరూపు సేవ - లభించుటచే॥ నోహో॥
చ॥ 1 వర మునిపాలుని - పావనచరితుని
స్థిరమతిగొలిచెడి - ప్రాప్తిలభించె॥ నోహో॥
2 పతితపావనుని - భక్తపోషకుని
సద్దర్శనమది - దొరుకుటచే॥ నోహో॥

(2 శంకరాభరణరాగము—ఏక తాళము

అందఱు...పాహి - పాహి - వరదా!
పాహి- పాహి- ముకుందా! ॥ పాహి॥
1 కరుణగనవె - మనవివినవె - దయనుబ్రోవరే
పరమపురుష - పాపవిమోచన - భక్తసుపోషణ రావా॥పా॥
మునీంద్రవాన - శ్రీపతీ
పాహి - పాహి - కరుణింపవె - సదయ॥ పాహి॥

(3) వ అనుబంధము.

అందఱు—పాహి - భవభంజనా! - పాపవిమోచన ॥ పాహి॥
దేవ—మంధరపర్వతము - మందగతినీ
పాదోరాశినిమునిఁగి - పోకుండఁగగావవె॥ పాహి! ॥
రాక్ష—సావిత్రిమిముగొల్తుము - మనసారగ
నీ మహామహిమజూపి - యిద్యోదమమునుగావవె॥ పాహి॥
అందఱు—రావే - దీనదయాకర - మాంపాహి - పాహి
యనివేడెడి మామొఱవిని - కనికరమున్న పాహి॥

(4) కళ్యాణిరాగము-ఆదితాళము.

ఇంద్రి—1 దయజూడుమా_రమాధవా.ఆ...ఆ......దయ॥
సమయంబిదె నీ - యనుగ్రహము మాపైనిల్పగ ॥దయ॥
2 బలవంతులు యీ- వలలాశిములగుటగా
హరియించిరి పీ . యాగంబయ్యో దిక్కు_లేదు ॥దయ॥
3 కష్టించిన మా- కష్టమువృధయయ్యెగా
సృష్టిస్థితిలయ కారక - చేరిమమ్ము గాపాడుమా॥దయ॥

(5) లతాంగి రాగము- త్రిపుటతాళము.

బలి—ఈ—లతాంగి తను - నీయగము
శీతాంశుని బురడించును - మది
కెంతో మోదము నించును ॥ఈ॥
చాలసౌఖ్య మొనర్చన్ - సంతోషము మదిహెచ్చగా ॥ఈ॥
ఈసుధారసంబునకు తోడీ - మధురసుధారస పానముజేసెడి
ప్రాప్తిలభించిన - చాలదే - జన్మము ధన్యముగాదే ॥ఈ॥

(6) పూ:కళ్యాణి రాగము_జంపెతాళము.

బలి—లెండు లెండు రండు రండు భండనమున
మొండిసురలను - గూడపించి - జేయుటకై వడివడి ॥లెండు॥
కరుణింపక — దురమందున - శరమున్నను - సురల బట్టి
పీచమణచి - పీయూషము హరియింపగ - కదుముదమున॥లెం

(7) ధన్యాసిరాగము_ఏకతాళము.

నార—దేవదేవ - వాసుదేవ - శ్రీధవా ! ॥దేవ॥
శుభములొసగి నీ - భక్తుల.గాపాడుము దయతోడుత ॥దేవ॥
సకలనిగమ స - న్నుతగుణశీలా-సాదరమున-మము సాకుము
నీమహామహిమజూపి - నిగమాంతక-
వేదవేద్య - నిర్గుణరూపా ॥దేవ॥

(8) సేవ అనుబంధమే పాడవలయును.

(9) భైరవిరాగము—రూపకతాళము

నార—జయ - జయ - శ్రీలోలా
జయ - జయ - సగుణాలవాల.
శుభగశీల - సుజనపాలా - శ్రీశ ॥జయ॥
మునిజనమందార—శరణింపుము మమ్మందజ
నిఖిలలోకసంవేద్య-నిగమాంతవేద్య ॥జయ॥

(10) జంగ్లారాగము-ఏకతాళము.

వి—హరిభజనమే - ముక్తిసాధనము ॥హ॥
అండపిండబ్రహ్మాండమెల్ల
నిండి వెలిగెండి యాశ్రీహరి ॥హరి॥
చిన్మయరూపుని - సేవలభించిన
మత్సర - మద - మోహమమత లడంచెడి ॥హరి॥

(11) ముఖారిరాగము-ఏకతాళము.

లీలా...నాథా! మనముద్దుసుతుడు కాడా?
వానియెడల ప్రేమలేదా? దయరాదా? ॥నాథా॥
తల్లిప్రాణమగుటకు - యిటుతల్లడించుచుంటి
నాయెడల ప్రేమలేదా - ననుబట్టివీని
గావరాదా! దయరాదా? ॥నాథా॥

[12] శ్రీరాగము అటతాళము.

లీలా—తగునా యిదితనయా.
నీవంటివానికింతపట్టు ॥తగు॥
హరియనుచు ముక్కు మొగమెఱుగనివానిని గొల్చి
కన్నతండ్రి - తోడ - వైర - మూన - నీకు ॥తగు॥
పర్వాలకును వి - శ్వకు దైవము " "
కన్న - తండ్రి - యనుచు నిన్నకుంట ॥తగు॥

(13) కల్యాణిరాగము-ఏకతాళము.

లీలా — ప్రాణేశా! నీవింత—వంతమూనఁగనేల?
పసిబాలుఁడనిదైన - భావింపవేల? ॥ప్రాణే॥
నీమాటవినకున్న — నిముషమందునవాని
బందెపెట్టుము నాథ — వధియింపమాని ॥ప్రాణే॥
పుత్త్రదుఃఖముతోడ — బొగులుచుంటిని నాథ
పుత్త్రభిక్షముపెట్టి—ముదమార ననుగావు ॥ప్రాణే॥
ముల్లోకములుగెల్చి — వరలునీప్రజ్ఞ
కెవ్వారు నిల్తురు — యేటికి భయమింక ॥ప్రాణే॥

(14) నిత్యకల్యాణిరాగము-ఏకతాళము.

ప్రహ్లా—దయగనుమా . నీభక్తునియెడ ॥దయ॥
నిత్యకల్యాణమూర్తివైన - యో
నిర్గుణ పరబ్రహ్మమూర్తి
నీనామమె జపియించితినని
క్రూరహృదయుఁడై - క్రూరసర్పముల
కెఱజేయుచుండె నిర్దయ ॥దయ॥

(15) హంసధ్వనిరాగము-త్రిపుటతాళము.

లీలా—నా మొరాలింపవా-
నను దయగనవా? సుతునిప్రోవలేవా? ॥నా॥
కనికరింపుమనుచు నీ - కాళ్ళంటితిగాదా?
[illegible]న్నింపవు [illegible]నా?—మనము ఱాయ జేయతగవా?

(16) సుకల్యాణిరాగము-ఏకతాళము.

ప్రహ్లా—పతితపావన - భక్తపోషణ
పాహి పాహి - యని - నీ
పదములు ప్రార్థింతి - భక్తుని బ్రోవుము ॥పతి॥

చిన్మయరూపా ! స్థిరతభజించెద - చెప్పరకొన్నిపుడు ॥వది॥
నీనామము జెప దలంచిన ఘోరపాపములు గాలిపోవుగద ॥వది॥

(17) ఫరజు రాగము-ఏకతాళము.

శుక్రు—వలదుదాన వేశ్వరా? యీదానమీయవలదు ॥వలదు॥
భూసురుం డితండుగాడూ - వాసుదేవుడితండూ
దేవదేవునకు దానమిడ - నీతరమంచెద నెంచితె ।వల॥
ఆదిపరబ్రహ్మమూర్తి యీ - యవతారంబెత్తెను
నాపల్కులు వినుము యీ దానము మానుము ॥వల॥
వటుగాంచుము మది దలంపకు మితండా
యింద్రుని గావంగ బుట్టిన శ్రీహరిజిష్ణు ॥వలదు॥

(18) బ్యాండుట్యూను.

పరశు—పనిచేయునో? వృధపోవునో?
గనుగొందుము నిలుము దుర్మతీ ॥పని॥
ఖలుడవగుచు నీవు నిటుల కాలుబలుపలాభమే
ఖలమతి - నిలుమిక - గర్వమడచి - గండడంతు ॥ప॥
పరశురాముడనిన నీ - భావమందునేమిగా
దలచినావో - నిలువుమిక - ధైర్యమున్న - దలగబోక ॥ప॥

[19] బేహాగ్ రాగము-ఏకతాళము.

సీత—చంగుచంగుమని పరువిడుచుండెడి యీళు
రంగంబును గనుడీ - గనుడీ- నాథా ! గనుడీ ॥చంగ
సాకి—మదికెంతో ముదముగూర్చెడి
వింతవింతరంగుల నొప్పారెన్
చెంతనున్న హృదయానందమగున్
మంత్రి—దయతోడన్ - దానినిబట్టన్-యత్నముజేయన్
వేడెదమిమ్ముగా ॥చంగుచంగు॥

(20) మోహనరాగము—జంపెతాళము.

రావ—ఈజగ - న్మోహనాంగి సాగ
సెంతో రమణీయమై యలరారెగా॥ ఈ॥
అలరారెగా - మది - కల - వర పఱచెనుగా॥ ఈ॥
లలనామణికూర్చిన - సౌఖ్యం బలపడుగా॥ ఈ॥
సోదరి చెప్పిన - శుభలక్షణములు
మోదమునించెఁ - ముగుదనుగాంచన్॥ ఈ॥

(21) బిళహరిరాగము—ఏకతాళము.

సీత—తపసివనుచు భ్రమసితిరా। దైత్యాధమ పోపోరా॥
రాముసతిని - నేమటంచు। నీమనమున - నెంచితివో
కాలుబిట్టు లఱచుమన్న। కాలుపోరి కేగుమవిక॥ తప॥

(22) ఫరజురాగము ఏకతాళము.

యశో—ఈ బాలుని - మాహాత్మ్య మెఱుగంగ
వశమౌన - నెవ్వారికైన। ఈ॥
సర్వలోకంబు లీ - బాలుని వక్త్రములో
గాన్పించుచుండె - నద్భుతమదియేమో॥ ఈ॥
కొడుకంచు నేనెంతో - మఱిమఱి మురిసితి—నీ
యాదిమధ్యాంతరహితుఁడని యోచనైతి॥ నిబా॥

(23) శంకరాభరణరాగము—ఏకతాళము.

బ్రహ్మ—తప్పుక్షమియింపుమయ్యా। దేవకీనందనా మాదు॥ తప్పు॥
నీమహాత్మ్య మెఱుగ - నేరక జేసినట్టి॥ తప్పు॥
పరపరివిధముల నీ - పదములనేబట్టి
స్థిరమతినిన్ వేడుకొందు — చెచ్చెఱ ననుబ్రోవుమయ్యా॥ తప్పు॥
నిన్నెఱుంగతరమే - నీమాయ తెలియ తరమే
నిఖిలలోకధన్య - నిన్నెవ్వరికాదుతరమా॥ తప్పు॥

